శ్రీరస్తు.

# ఆంధ్రనిఘంటుత్రయము

(టీకాతాత్పర్యసహితము.)

పండిత ప Date ము





రామా అండ్ కో.,
ఏలూరు.

తాతా ముద్రాక్షరశాల,

నిడుబ్రోలు.



1929

# పీఠిక.

భాషాజ్ఞానమునకు నిఘంటువులే ముఖ్యావశ్యకంబులు. అవి లేనిచో వాడుకొనఁబడెడు మాటలే యలవడునుగాని పూర్ణమగు జ్ఞానము గలుఁగనేరదు. రసప్రధానములగు గ్రంథములయందలి భావంబుల నెఱుంగవలయునన్న వివిధములగు శబ్దములును వాని పర్యాయ పదంబులు నెఱుఁగుట యవసరము. వాని కన్నిటికిని నిఘంటువులే యాధారములు. అట్టి నిఘంటువులు సంస్కృతమున నమరకోశాదు లనేకములు చూపట్టుచున్నవి. మన యాంధ్రభాషయందలి శబ్దంబులు తద్భవతత్సమదేశ్య గ్రామ్య రూపంబులచేఁ జతుర్విధములై యున్నవి. అందు దత్సమభాష సంస్కృత సమముగావున సంస్కృత నిఘంటువులవలన నేర్చుకొనఁదగియున్నది. గ్రామ్యభాష జనులచే వాఁడఁబడుచున్నను గ్రంథ ప్రయోగమున కనర్హంబు. మిగిలిన తద్భవదేశ్యపదంబులే గ్రంథప్రయోగమునకుఁ దగియుండుటచే నట్టి తద్భవదేశ్యపదంబులను జేర్చి మహాత్ములగు మన పూర్వు లాంధ్రనిఘంటువుల రచించియున్నారు. వానిలో నెల్ల ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువునను నివిమిగులఁ బ్రశస్తములు. ఎల్లజనులచే నెల్లయెడల వాఁడబడుచున్న వీని యుపయోగమును జదువరులే గ్రహించుచున్నారు. నిఘంటువునకుటీక వ్రాయుటలో నావశ్యకములగు విషయములు మూఁడు

అవియెవ్వి యన రూఢి పదములకుఁగాక తక్కిన పదముల కవయవార్థము తెలుపుటయొకటి. ఆరూపము లెట్లేర్పడెనో వాని తెలుపుట మఱియొకటి. ఆ రూపము లవసరమగుచో వ్యాకరణసూత్ర దృష్టాంతములచేఁ దెలుపుట మఱియొకటి. ఇమ్మూఁడు విధములచే నిందుఁ దెలుపఁబడియున్నవి. వ్యాకరణాంశములకు శ్రీపరవస్తు చిన్నయసూరి విరచిత బాలవ్యాకరణసూత్రము లిందుఁ జేర్పఁబడినవి. పదముల యవయవార్థమును దెలిసికొను నప్పుడా సూత్రములనుగూడ నప్పటనే వ్రాసినచో సుబోధముకాదని తలంచి వానిని గ్రిందియడ్డగీటునకుదిగువ వ్రాసితిమి. రూఢిపదంబులును, నవయవార్థరూప నిష్పత్తి ప్రకృతి వికృతి రూపాంతరంబులొక్కచోఁ జేర్పఁబడి యున్నవి. పద్యంబులందలి పదంబులు సులభముగఁ దెలియుటకై అకారాద్యనుక్రమణిక యేర్పఱుపఁబడినది. దానిమహోపయోగ మెల్లరకును దెలియఁగలదు. కావున నీగ్రంథమున నేనైన లోపములున్నచోఁ దెలిపి యింకను వృద్ధిలోనికిఁ దెచ్చి దీనికి వన్నె గలిగించి యిట్టివానిలోఁ బ్రోత్సాహమును గలిగింతురుగాకయని భాషాభిమానులఁ గోరుచున్నాఁడ.

శ్లో॥ ఖ్యాతింగమయతి సుజనస్సుకవిర్విదధాతి కేవలం కావ్యం
పుష్ణాతికమల మంభోలక్ష్మీంతు రవిర్నియోజయతి॥

భోజచరిత్రమ్.

## ఆంధ్రనామ సంగ్రహము.

పైడిపాటి లక్ష్మణకవి దీని రచించెను. ఈకవి కౌండిన్యసగోత్రుండు. ఏకామ్రమంత్రి పుత్రుడు. కవి యీ గ్రంథముఖమున "శ్రీపతి వంద్యున్" అని సర్వశుభ మూలంబగు శ్రీకారమును బ్రయోగించి తన గ్రంథమును శ్రీ కాశీవిశ్వేశ్వరున కంకితము చేసెను. ఈకవి శివభక్తుడు. ఇందులేని నవీన పదములఁగూడ వ్రాసెదనని ప్రతిజ్ఞచేసి ఆంధ్రనామ శేషము నువ్రాసిన అడిదము సూరకవి క్రీ॥ శ॥ 1750 మొదలు 1780 వఱకు నుండుటచే నంతకు బూర్వుఁడగు నీలక్ష్మణకవి పదునేడవ శతాబ్దములోని వాఁడని నిర్ణయింపవలెను.

## ఆంధ్రనామ శేషము.

అడిదము సూరకవి దీనిని పద్యకావ్యమున వ్రాసెను. ఈ మహాకవి కవనము జిల్లుపొల్లులులేక నిర్దుష్టముగానున్నది. ఈతఁడు బాలభాస్కరుని కుమారుఁడు. నియోగి బ్రాహ్మణుఁడు. ఈకవి వరేణ్యుఁడు కవిజన రంజనము, కవిసంశయవిచ్ఛేదము, రామలింగేశ్వర శతకము, ఆంధ్రచంద్రావలోకనము అనుగ్రంథముల రచించెను. ఇవన్నియు మిక్కిలి వాడుకలో నున్నవి. ఈకవి యీగ్రంథమున వర్గులనుగాఁ దెలుపలేదు,

## సాంబనిఘంటువు.

కస్తూరి రంగకవి యీ నిఘంటువును వ్రాసెను. ఈ కవికి సాంబమూర్తియం దెక్కువ భక్తియుండుటచే దీనికీపేరు

పెట్టియున్నాఁడు. ఈతండు నిరంకుశముగాఁ బదప్రయోగము
చేసెను. పై రెండు గ్రంథములలో లేని నూతన పదంబులిందుఁ
గన్పట్టుచున్నయవి. ఈకవి ద్రావిడ పదంబులఁ దన గ్రంథ
ములో నెక్కువగాఁ బ్రయోగించెనుగాన నితండు ద్రవిడదేశ
వాసియో లేక ద్రవిడదేశ సంచారియో యని తోఁచుచున్న
యది. కొంద ఱీతనిపై నప్రయుక్తపదంబులఁ జేర్చి యుండె
నని దోషారోపణము చేసెదరుకాని యది గణనీయముకాదు.
విశేషశబ్దంబులఁ దన నిఘంటువునఁ గూర్చి దేశమునకు
మహోపకార మొనర్చిన యీకవివరేణ్యుఁ డెల్లరకు వంద
నీయుఁడు.

# ఆంధ్రనామ సంగ్రహము



స టీ క ము .

ఆంధ్రనామసంగ్రహమను నీ నిఘంటువును సల్పఁబూనిన పైడిపాటి లక్ష్మణకవి తన గ్రంథము నిర్విఘ్నముగా నెరవేఱుటకును, భవిష్యద్గ్రంథకర్తలు గూడ నిట్లేయొనర్తురుగాక యని తెలుపుటకును, శిష్టాచార పరిప్రాప్తమగు నిష్టదేవతా నమస్కారరూప మంగళమును గ్రంథాది పద్యముచే నొనర్చి రెండవపద్యముచేఁ గృతిపతిని, మూఁడవ పద్యముచేఁ దననామమును గ్రంథనామమును గ్రంథవిషయములను జెప్పుచున్నాఁడు.

క. శ్రీపతివంద్యు విశాలా
క్షీపతిని భజించి యిష్ట ♦ సిద్ధులువరుసం
బ్రాపింపఁగ గణనాథుని
శ్రీపాదంబులకు నెఱఁగి ♦ చెందినవేడ్కన్. 1

క నతభక్తలోకరక్షా
రతికిం జంచత్కృపాత ♦ రంగితమతికిన్

శతమఖముఖసుర నుతికిం
గతికిన్ మహిమోన్నతికిని ♦ గాశీపతికిన్. 2

తే. అంకితమొనర్తుఁ దెనుఁగు పే ♦ ళ్ళరసికూర్చి
గరిమతో నాంధ్రనామ సం ♦ గ్రహమనంగ
నమరుకృతిఁ బైఁడిపాటి ♦ యేకామ్రమంత్రి
సుతుఁడఁ గవిలక్ష్మణాఖ్యుఁడ ♦ సుజనహితుఁడ. 3

తా. పైఁడిపాటి యేకామ్రమంత్రికుమారుఁడను, సజ్జనుల కిష్టుఁడను నైన పైఁడిపాటి కవిలక్ష్మణుఁడను నేను తలఁచినకోర్కెలు నెఱవేఱుటకై శ్రీమహావిష్ణువుచేఁ బూజింపదగిన విశాలాక్షీపతి యగు కాశీవిశ్వేశ్వరుల ధ్యానించి పిదప విఘ్నేశ్వరుని మహిమగల పాదములకు సంతోషముతో నమస్కరించి మ్రొక్కెడు భక్తులను గాపాడుటయందుశ్రద్ధగలవాఁడును, దయారసముతోఁగూడిన బుద్ధిగలవాఁడును, దేవేంద్రుఁడు మొదలగుసకల దేవతలచే, చేయఁబడునమస్కారముల నంగీకరించువాఁడును, విశేషమహిమ గలవాఁడును నైనకాశీవిశ్వనాథస్వామికినంకితముగాఁదెనుఁగు పేళ్ళన్నియు జేర్చి యాంధ్రనామసంగ్రహ మనుగ్రంథము నొనర్చెదను (అనిగ్రంథకర్త ప్రతిజ్ఞ చేయుచున్నాడు.)

అవ. గ్రంథకర్త తాను రచియింపఁదలఁచిన గ్రంథమునందలి పరిభాషను దెలుపుచున్నాఁడు:—

తే. దేవమానవస్థావర ♦ తిర్యగాఖ్య
వర్గులోనరింతు నానార్థ ♦ వర్గుగూడ
వర్గములు గాఁగఁ గూర్తు నా ♦ హ్వాయములందు
నిడుదు వివరించునెడల సం ♦ స్కృతపదంబు 4

తా. నేను రచింపఁబోవు ఆంధ్రనామసంగ్రహమందు దేవవర్గు, మానవ వర్గు, స్థావరవర్గు, తిర్యగ్వర్గు, నానార్థవర్గు అను నైదువర్గులను రచించెదను. పర్యాయపదములన్నియుఁ దెలుఁగుపదములుగా నుండును. అర్థమును వివరించుటకై ఆపర్యాయపదములకుఁ దుదను సంస్కృతపదము నుంచెదను. (అని గ్రంథకర్త చెప్పెను.)

[దేవవర్గునందు దేవతలు, వారికిసంబంధించినవి. చెప్పఁబడినవి. మానవ వర్గునందు మనుష్యులు, వారికి సంబంధించినవి వివరింపఁబడినవి. స్థావరవర్గునందుకొండలు, చెట్లు, మున్నగునచరములనుగూర్చి చెప్పఁబడినవి. తిర్యగ్వర్గునందు పశుపక్ష్యాదులకు సంబంధించినవానినిగూర్చి వివరింపఁబడినది. నానార్థవర్గునందు ననేకార్థములయిన పదములఁగూర్చి వివరింపఁబడినది.

క. శ్రీలలనాధిపవంద్య వి
శాలాక్షీప్రాణనాథ ♦ శతమఖముఖ ది
క్పాలాభీష్టద సమధిక
శీలా కాశీనివేశ ♦ శ్రీవిశ్వేశా. 5

తా. లక్ష్మీనాథుఁడగువిష్ణుచేతఁగొనియాడబడఁదగినవాఁడవును, కాశీవిశాలాక్షికి మగఁడవును, ఇంద్రాదిలోకపాలురకోర్కెల నీడేర్చువాఁడవును, గొప్ప స్వభావముగలవాఁడవునై కాశీపురియందు వెలయుచున్న యోవిశ్వేశ్వరా! నీవు నాగ్రంథము నవధరింపుము, (అని గ్రంథకర్త కృతిపతిని హెచ్చరించెను.)

—: దేవవర్గ :—

సీ. ముక్కంటి యురపది ♦ మోములవేలుపు
మినుసిగదయ్యంబు ♦ మిత్తిగొంగ

గట్టువిల్తుఁడు గఱ ♦ కంఠుఁడు మిక్కిలి
కంటిదేవర బేసి ♦ కంటివేల్పు

వలిమలల్లుఁడు మిన్ను ♦ వాకతాలుపు కొండ
వీటిజంగము గుజ్జు ♦ వేల్పుతండ్రి

వలరాజుసూడు జ ♦ క్కులజేని చెలికాఁడు
బూచులయెకిమీఁడు ♦ పునుకతాల్పు

తే. విసపుమేఁతరి జన్నంపు ♦ వేఁటకాఁడు
బుడుతనెలతాల్పు వెలియాల ♦ పోతురౌతు
తోలుదాలుపు ముమ్మొన ♦ వాలుదాల్పు
నాఁగ భవదాఖ్యలొప్పు (నం ♦ ధకవిపక్ష). 6

టీ. ముక్కంటి=మూఁడునేత్రములు కలవాఁడు, అయిదుమొగముల వేలుపు = ఐదుముఖములు గలదేవుఁడు, మినుసిగ దయ్యంబు = ఆకాశము జుట్టుగాఁగల దేవుఁడు, మిత్తిగొంగ = మృత్యువునకు శత్రువు, గట్టువిల్తుఁడు=(మేరు) పర్వతము ధనస్సుఁగా గలవాఁడు, కఱకంఠుఁడు = నల్లనికంఠము గలవాఁడు, మిక్కిలి కంటిదేవర = ఎక్కువనేత్రములుగల దేవుఁడు, బేసికంటివేల్పు = బేసిసంఖ్యయగుమూఁడుకన్నులుగల దేవుఁడు, వలిమలల్లుఁడు=మంచుకొండయొక్క (హిమవంతునియొక్క) అల్లుఁడు, మిన్నువాకతాలుపు- మిన్నువాక=ఆకాశనది, అనఁగా నాకాశగంగను ధరించినవాఁడు, కొండవీటిజంగము = కైలాసపర్వతము పట్టణముగాఁగల బిచ్చగాఁడు గుజ్జువేల్పుతండ్రి = పొట్టిదేవరయగు విఘ్నేశ్వరుని జనకుఁడు, వలరాజసూడు = మన్మథునికి విరోధి, జక్కులజేని చెలికాఁడు— జక్కులు = యక్షులు, వారికి రాజగు కుబేరునకు మిత్రుఁడు, బూచులయెకిమీఁడు = పిశాచము

లకు ప్రభువు, పునుక తాల్పు=పుఱ్ఱెను (బ్రహ్మకపాలమును) ధరించిన వాఁడు, విసవుమేఁతరి = విషముఁదిన్న వాఁడు. (విసము-ప్రకృతి-విషము) జన్నంపు వేఁటకాఁడు=దక్షుని యాగముధ్వంసముచేసినవాఁడు,(జన్నము + వేఁటకాఁడు) బుడుత నెలతాల్పు=బాలచంద్రుని (శిరంబునఁ) దాల్చినవాఁడు గిలియాలపోతురౌతు = తెల్లనియాబోతు నెక్కు యోధుఁడు, తోలుదాపు=(వ్యాఘ్ర) చర్మమును ధరించువాఁడు, ముమ్మొనవాలుదాల్పు=మూమొనలుగల ఆయుధమును (త్రిశూలమును) ధరించినవాఁడు, నాఁగఁ=అను ఈయిరువది రెండును, అంధకవిపక్ష=అంధకాసురుని శత్రుడా!భవత్ ఆఖ్యలు ఒప్పును=నీ పేళ్ళనఁదగు (ఈపద్యములోఁ జెప్పిన ౨౨ ను ఈశ్వరుని పేళ్ళు.)

సీ. సోఁకుమూకలగొంగ,♦ చుట్టుగెదువుజోదు,
పచ్చవిల్తునితండ్రి,♦ లచ్చిమగఁడు,
పులుఁగుతత్తడిరౌతు,♦ వలమురితాలుపు,
వెన్నుఁడు,కఱివేల్పు,♦ వెన్నదొంగ,
నునుగాడ్పుదిండి పా♦ నుపున బండెడిమేటి,
బమ్మదేవరతండ్రి,♦ తమ్మికంటి,
పదివేసములసామి,♦ పసిఁడిపుట్టముదాల్పు,
కట్టినెచ్చెలి,తరి ♦ గట్టుదారి

---

బహువ్రీహిసమాసాంతకార్యములు చూపట్టెడి.

బాలసమా. 22 సూ. చేత'ముక్కంటి,గట్టువిల్తుడుఅని యయ్యెను.

" ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు" బాల. సంజ్ఞా 23 సూ. చేత నిది యనిఁద్యగ్రాహ్యము.

కర్మధారయమందు ముపర్ణమునకు. పుంపులగు. బాసం 32సూ చేత పుంపుగాగమము.)

తే. యాలకాపరి వ్రేతల ♦ మేలువాఁడు,
పాలకడలల్లుఁడును బక్కి ♦ డాలు ఱేఁడు,
ఱేయుబవలును జేయు కం♦ దోయివాఁడు,
మామమామన, హరియొప్పు ♦ (శ్రీమహేశ.) 7

టీ. సోఁకుమూఁకలగొంగ=రాక్షససమూహములకు శత్రువు, చుట్టుఁగైదువుజోదు = గుండ్రని యాయుధమును (సుదర్శనచక్రమును) దాల్చు వీరుఁడు, (యోధశబ్దమునకు వికృతి-జోదు) పచ్చవిల్తునితండ్రి=పచ్చని విల్లుగల (మన్మథునికి) దండ్రి, లచ్చిమగఁడు=లక్ష్మికిభర్త (లచ్చి-ప్రకృతి-లక్ష్మి) పులుగుతత్తడిరౌతు=గరుడవాహనము నెక్కెడి వీరుఁడు;వలమురితాలుపు=కుడిప్రక్కకుఁ దిరిగిన (పాంచజన్యమనెడి) శంఖమును ధరించువాఁడు, వెన్నుడు (ప్రకృతి-విష్ణుఁడు,) అంతట వ్యాపించువాఁడు, కతివేల్పు=నల్లని (మేనిచాయగల) దేవుడు, వెన్నదొంగ = (కృష్ణావతారమున గోపికలయిండ్లయందు) వెన్నను దొంగిలించినవాఁడు, * నునుగాడ్పునిం పానుపునఁ బండెడుమేటి = మృదువైన వాయువును భక్షించెడు పా

---

() మూలములో నీ కుండలములనునుంచఁబడిన పదములు పర్యాయ అర్థములకు సంబంధపడవని యెఱుఁగుడు.

[చుట్టు + కైదువు-చుట్టుగైదువు, సమాసమున నుదంత స్త్రీసమ లకుఁబరుషసరళములు పరములగునపుడును గాగ మంబగు. బా,సంధి .25సూ

* 'నునుగాలిమేఁత పానుపునఁ బండెడిదొర'-అని పాఠాంతర

ఆవు—బహు. ఆవులు.-లేక ఆలు (బహువచనము పరంబగునపుడా ప్రభృతుల తుదియక్షరంబునకు లోపం బగు. బా. సంధి.21సూ. చేత ఆవు శబ్దమున కంఠ్యవర్ణలోపము.)

మామమామ = మామ యగు సముద్రమునకు మామ—(శ్రీమహేశా) హరి ఒప్పును. ఈ ౨౨ పదములును విష్ణువు పేళ్ళు.

తల్పమునందుఁ బఱుండుదొర, సర్పములు పవనాశనములు అని ప్రమాణము. బమ్మ దేవరతండ్రి = బ్రహ్మదేవునికిఁ దండ్రి, (బ్రహ్మ-ప్రకృతి-బ్రహ్మ) తమ్మికంటి = కమలములఁబోలు కన్నులు గలవాఁడు, పదివేసములసామి= దశావతారము లెత్తిన దేవుఁడు. (సామి-ప్రకృతిస్వామి. వేసము-ప్రకృతి-వేషము.) పసిఁడిపుట్టము దాల్పు = బంగరు వస్త్రమును ధరించినవాఁడు, కవ్వినెచ్చెలి = అర్జునునకు ముఖ్యస్నేహితుఁడు. (నెఱ + చెలి = నెచ్చెలి) తరిగట్టుదారి=కవ్వపుఁ గొండను (మందరపర్వతమును) తాల్చిన వాఁడు, ఆలకాపరి = గోవులఁ గాచినవాఁడు, వ్రేఁతలమేలువాఁడు = గోపికా స్త్రీలకు మేలుచేసినవాఁడు, పాలకడలల్లుఁడు = (లక్ష్మీదేవికిఁ దండ్రియైన) క్షీరసముద్రమున కల్లుఁడు, పక్కిడాలు ఱేఁడు = గరుడ ధ్వజముగలప్రభువు, రేయుపవలును జేయు కన్దోయివాఁడు =రాత్రిని పగ టిని జేయు (సూర్యచంద్రులు) రెండుకన్నులు గలవాఁడు.

సీ. పక్కిడాల్వేలుపు ♦ పొక్కిలి పసిబిడ్డఁ,
డంచతేజీనెక్కి ♦ యాడురాతు,
మనెడు ప్రొద్దులనోస ♦ ళ్ళను వ్రాయుదేవర,
చదువుల వేలుపు, ♦ జన్నిగట్టు,
తెలిదమ్మిగద్దియఁ ♦ గొలువుండురాయఁడు,
నిక్కపుజగమేలు ♦ నేర్పుకాఁడు,
కడుపుబంగారు బొ ♦ క్కసముఁ జేసినమేటి,
పొరోగిరముతిండి ♦ పోఁతుతండ్రి,

ఆ. నలువ తమ్మిచూలి, ♦ నలుమొగంబులవేల్పు,
వేల్పుపెద్ద, పలుకు ♦ వెలఁదిమగఁడు,

తాత, బమ్మ, యన వి ♦ ధాతనామములొప్పు
(నఘవినాశ యీశ ♦ యభ్ర కేశ).

టీ. పక్కిడాల్వేలుపు పొక్కిలిపసిబిడ్డఁడు = గరుడధ్వజుఁడైనవిష్ణువు యొక్క నాభియందుఁ బుట్టిన చిన్నబిడ్డఁడు, అంచతేజీనెక్కి యాపు రౌతు = హంసనే గుఱ్ఱముగా నెక్కి తిరుగుశూరుఁడు, మనెడు ప్రొద్దులనోసళ్ళనువ్రాయుదేవర = (మానవుల) జీవితకాలమును మోములందు వ్రాసెడు వేల్పు, చదువులవేలుపు = విద్యలకుఁ బ్రభువు, జన్నిగట్టు = యజ్ఞోపవీతమును దాల్చినవాఁడు, తెలిదమ్మిగద్దియఁ గొలువుండురాయఁడు = తెల్లనితామరపువ్వు అనెడు సింహాసనమందుఁ గూర్చుండు ప్రభువు, నిక్కపు జగమేలు నేర్పుకాఁడు = సత్యలోకమును బాలించెడి నేర్పుగలవాఁడు, కడుపు బంగారు బొక్కసముఁ జేసిన మేటి = పొట్టను బంగారపుగొట్టును గాఁజేసిన దిట్టరి. (హిరణ్యగర్భుఁడు,) పోరోగిరము తిండి పోఁతుతండ్రి = జగడమే యాహారముగాఁ గలిగిన నారదునికిఁ దండ్రి, నలువ = నాలుగు నోళ్ళుగలవాఁడు. (నాలుగు వాతులుగల వాఁడు) తమ్మిచూలి = (విష్ణువునాభి) కమలమునందుఁ బుట్టినవాఁడు, నలుమొగంబుల వేల్పు = చతుర్ముఖుఁడగు దేవుఁడు, వేల్పుపెద్ద = దేవతలకుఁ బెద్దవాఁడు. పలుకువెలఁదిమగఁడు = వాక్కులదేవి యగు సరస్వతీదేవికి భర్త, తాత = పితామహుఁడు, బమ్మ (బ్రహ్మశబ్దభవము.) ఈ౧౬ను బ్రహ్మదేవుని పేళ్లు.

తే. గట్లరాయనిపట్టి। ము ♦ క్కంటి వెలఁది।
యేనుఁగులగొంగతత్తడి ♦ నెక్కుదంట।

---

సముద్రుఁడు తన కూతురగు లక్ష్మినిచ్చుటచే విష్ణువునకు మామ యయ్యె విష్ణుఁడు తనపాదోద్భవయగు గంగనిచ్చుటచే సముద్రమునకుమామయయ్యె. నలువ బహువ్రీహి బా సమా. 22 సూ. చేత సమాసాంతకార్యము గలిగినది.

సామిసామేనిఁ జేకొన్న ♦ చాన జగము
తల్లి, యన గౌరి పేళ్లొప్పు ♦ (ధరనుమేశ). 9

టీ. గట్టురాని పట్టి=పర్వతరాజగు హిమవంతుని కూఁతురు, ముక్కంటి వెలఁది = త్రినేత్రుని భార్య, ఏనుఁగుల గొంగతత్తడి నెక్కు దంట = ఏనుఁగుల కు విరోధియైన సింహము నెక్కెడు ధీరురాలు, సామిసామేనిఁ జేకొన్నచాన = భర్తయొక్క యర్ధాంగమును గ్రహించిన యాఁడుది (సామేను = సగముదేహము,) జగముతల్లి= లోకముయొక్క తల్లి-అను, ఈ ౫ ను పార్వతికిఁ బేళ్లు.

తే. లచ్చి కలుములజవరాలు, ♦ పచ్చవిల్తు
తల్లి కఱివేల్పు నిల్లాలు, ♦ తల్లితల్లి।
కడలి కూఁతురు। సిరి లిబ్బి ♦ పడఁతి, తమ్మి
యింటిగరిత, శ్రీ యొప్పు ♦ (మృగధరాంక). 10

టీ. లచ్చి (లక్ష్మీశబ్దభవము), కలుములజవరాలు=సంపదలుగలయాఁడుది, పచ్చవిల్తుతల్లి=మన్మథునితల్లి, కఱివేల్పునిల్లాలు=విష్ణుపత్ని, తల్లితల్లి= తల్లియైన గంగకు దల్లి, కడలికూఁతురు=సముద్రునికూఁతురు, సిరి (శ్రీశబ్దభవము.) లిబ్బిపడఁతి=నిధులయందుండు దేవత, తమ్మియింటిగరిత = పద్మమనెడి యింటనుండు స్త్రీ, (పద్మాలయ)-అను ని ౯ యు లక్ష్మికి నామములు.

క. తలపాఁకిటను మెలంగెడు
పొలఁతుక। పలుకుల వెలంది, ♦ పొత్తముముత్తో
చలువపడఁతి। కలుములపై।
దలికోడలనంగ। బరఁగు ♦ (ధర) వాణి (శివా). 11

టీ. తలవాఁకిటను మెలంగెడు పొలఁతుక=తలకు వాకిలియగు నోటి యందు సంచరించు స్త్రీ, పలుకుల వెలంది=వాక్కుల కధిదేవత యగు పడుచు, పొత్తముత్తో = పుస్తకములయందు వెలయునట్టి ముత్తైదువ, నలువపడఁతి = బ్రహ్మదేవుని భార్య. కలుముల పైదలికోడలు = సంపద కధిదేవతయగు లక్ష్మీదేవికిఁ గోడలు (లక్ష్మీపుత్రుఁడగు బ్రహ్మకు భార్య ఈ ౫ ను సరస్వతికిఁ బేళ్ళు,

సీ. ఇద్దఱుతల్లుల ♦ ముద్దుబిడ్డఁడు, పని
చెఱుపులదొర, చేట ♦ చెవుల వేల్పు,
వంకరతొండంబు ♦ వాఁ డేనుఁగు మొగంబు
దేవర, పాపజం ♦ దెములమేటి,
ప్రొక్కువారల పనుల్ ♦ చక్కఁజేసెడు సామి
గటకపూజల మెచ్చు ♦ గబ్బివేల్పు,
ముక్కంటిపండుల ♦ మెక్కెడితిండీఁడు,
ముక్కంటిగారాబు ♦ ముద్దుపట్టి,

ఆ. వె. పెద్దకడుపువేల్పు ♦ పిళ్ళారి, కుడుముల
తిండికాఁడు, కొక్కు ♦ తేజిరౌతు,
గుజ్జువేల్పు, పొంటి ♦ కొమ్ముదేవర, వెన
కయ్య, యన వినాయ ♦ కాఖ్య (లీశ) 12

టీ. ఇద్దఱు తల్లుల ముద్దుబిడ్డఁడు = గంగా పార్వతుల కిద్దఱకుఁ బ్రేమంపుఁ బుత్రుఁడు, పనిచెఱుపులదొర = కార్యవిఘాతము చేయుదేవుఁడు, చేటచెవులవేల్పు = చేటలవంటి చెవులుగల దేవుఁడు, వంకరతొండంబువాఁడు=వంకరగానుండు తొండము గలవాఁడు, ఏనుఁగు మొగంబు

దేవర=ఏనుఁగు మోముగలదేవత, పాపజందెముల మేటి=పాములే యజ్ఞోపవీతముగాఁ దాల్చు వీరుఁడు, మ్రొక్కువారలపనుల్ చక్కఁజేసెడుసామి = నమస్కరించువారి కార్యము లనుకూలపఱచు దేవుఁడు. గటికపూజల మెచ్చు గబ్బివేల్పు=గటికపూజకు మెచ్చుకొనెడు గొప్పదేవుఁడు, ముక్కంటిపండుల మెక్కుడుతిండీఁడు = టెంకాయల దినెడువాఁడు, ముక్కంటిగారాబుముద్దుపట్టి=త్రినేత్రునికి మిక్కిలి యిష్టుఁడగు కుమారుఁడు, పెద్దకడుపువేల్పు = పెద్ద బొజ్జగలదేవుఁడు, పిళ్ళారి, కుడుములతిండికాఁడు = కుడుములు తినువాఁడు, కొక్కుతేజిరౌతు = మూషకవాహనము నెక్కుయోధుఁడు, గుజ్జువేలుపు = పొట్టిదేవుఁడు, ఒంటికొమ్ము దేవర=ఒక దంతముగలదేవుఁడు (ఏకదంతుఁడు) వెనకయ్య-వినాయకశబ్దభవము, ఈ ౧౮ ను వినాయకుని పేళ్ళు.

సీ. పెనుఁబాపకవణంబుఁ ♦ దినువారువమురౌతు
గట్టులయెకిమీని ♦ పట్టిపట్టి
ఱెల్లుచూలార్గురు ♦ తల్లుల కొమరుండు
గాడుపుసంగడి ♦ కానికొడుకు
పుంజుదాలుపువేలు ♦ పులజేనిదళవాయి
జంటమువ్మాముల ♦ దంటవేల్పు
కొంచగుబ్బలివ్రక్క ♦ లించిన బలుదిట్ట
రెండాఱుచేతుల ♦ దండిమగఁడు

తే. వేలుపులమూఁక పేరిటి ♦ వెలఁదిమగఁడు
వేల్పుగమికాఁడు వెనకయ్య ♦ వెనకవాఁడు
కొమరుసా మన సేనాని ♦ కొమరుమిగులు
(విగతభవపాశకాశీని ♦ వేశ యీశ). 13

టీ. పెనుఁబాపకవణంబుఁ దినువారువపుఱౌతు = గొప్ప సర్పముల ముద్దలనుమ్రింగు నెమలినెక్కుయోధుఁడు, (మయూరవాహనుఁడు) గట్టులరయెకిమీనిపట్టిపట్టి = పర్వతపుత్త్రియగు పార్వతికిఁ బుత్త్రుఁడు, జెల్లుచూలు. = జెల్లునందుఁ బుట్టినవాఁడు, ఆర్గురుతల్లుల కొమరుండు=షట్కృత్తికలకుఁ బుట్టినవాఁడు, గాడుపుసంగడికాని కొడుకు=వాయుసఖుఁడగు అగ్నికిఁ బుత్త్రుఁడు, పుంజుదాలుపు = కోడిపుంజు ధ్వజమునందు ధరించినవాఁడు (శిఖివాహనుఁడు) వేలుపుల జేనిదళవాయి=ఇంద్రుని సేనాధిపతి, జంటముమ్మోములదంటవేల్పు=ఆఱుముఖములుఁగలదేవతోత్తముఁడు, కొంచగుబ్బలి వ్రక్కలించిన బలుదిట్ట = క్రౌంచపర్వతంబును బగులఁగొట్టిన బలవంతుఁడు, రెండాఱుచేతులదండిమగఁడు=పండ్రెండు చేతులుగలధీరుఁడగు పురుషుఁడు, (రెండాఱులు=పండ్రెండనియర్థము), ఇట్లే, జంటమూఁడులు=రెండుమూఁడులు, (ఆఱు అని యర్థము) వేలుపుల మూఁకపేరిటి వెలఁదిమగఁడు = దేవ సేన యను కాంతకు భర్త. వేలుపుగమికాఁడు=దేవతల సేనాధిపతి, వెనకయ్య వెనకవాఁడు = వినాయకుని తమ్ముఁడు, కొమరుసామి (కుమారస్వామి శబ్దవికృతి,) ఈ ౧౮ ను కుమారస్వామికిఁ బేళ్ళు.

సీ, అలరువిల్తుండు।క ♦ న్నులవిల్తుఁడును।గమ్మ
విలుకాఁడు।చక్కెర ♦ వింటివాఁడు ।
చెఱకువిల్కాఁడు।కెం ♦ జిగురుల విల్తుఁడు।
వెడవిల్తుఁడును।బచ్చ ♦ విల్తుఁడించు।
విల్లుదాలుపు।తుంట ♦ విలుకాఁడు।తియ్యవి
ల్కాఁడును।జమిలిము ♦ క్కాలినారి
విలుకాఁడు।చౌవంచ ♦ ములుకులుగలదంట।
రాచిల్క నెక్కెడు ♦ రాయరౌతు

తే. మీనుమొసలిసిడంబుల ♦ మేటి|చంద
మామయల్లుఁడు|వలరాజు |♦ మరుఁడు| లచ్చి
కొమరుఁ|డనుపేళ్ళ నొప్పను ♦ గుసుమధన్వి
(విగతభవపాశ కాశీని ♦ వేశ యీశ.) 14

టీ. అలరువిల్తుండు = పుష్పములు ధనుస్సుగాఁ గలవాఁడు, కన్నులవిల్తుఁడు=గణుపు ధనుస్సుగ గలవాఁడు, కమ్మవిలుకాఁడు = తియ్యని ధనుస్సుగలవాఁడు, చక్కెరవింటివాఁడు =పంచదార ధనుస్సుగలవాఁడు, చెఱకువిలుకాఁడు = చెఱకుగడ ధనుస్సుగాఁ గలవాఁడు కెంజిగురులవిల్తుఁడు = ఎఱ్ఱనిచిగుళ్ళు విల్లుగాఁగలవాఁడు, వెడవిల్తుఁడు = చులకని ధనుస్సుగలవాఁడు, పచ్చవిల్తుఁడు = పచ్చని ధనుస్సుగలవాఁడు, ఇంచువిల్లుదాలుపు = చెఱకుగడ ధనుస్సు ధరించువాఁడు, తుంటవిలుకాఁడు = చెఱకుతుంట విల్లుగాఁ గలవాఁడు, తియ్యవిల్కాఁడు= తియ్యనివిల్లుగలవాఁడు; జమిలిముక్కాలినారివిలుకాఁడు = ఆఱుకాళ్ళుగలపురుగులు (తుమ్మెదలు) అల్లెత్రాడుగాఁగల ధనుస్సుగలవాఁడు, (జమిలిముక్కాళ్ళు = రెండుమూళ్ళుకాళ్ళు-ఆఱుకాళ్ళు.) చౌపంచములుకులుగలదంట = ఐదు బాణములు గలయోధుఁడు, రాచిల్క నెక్కెడు రాయరౌతు = శ్రేష్ఠమగు చిలుకనెక్కెడు మేటివీరుఁడు, మీనుమొసలిసిడంబులమేటి=చేఁపలు మొసళ్ళుధ్వజమునందుఁగల దిట్టరి, చందమామ యల్లుడు, = చంద్రునికల్లుఁడు, వలరాజు = ప్రేమలకు నధిపుఁడు, మరుఁడు, (స్మరశబ్దభవము) లచ్చికొమరుఁడు=లక్ష్మీదేవియొక్క పుత్త్రుడు=అను నీ ౧౯ యును మన్మథుని పేళ్ళు

కెంపు + చిగురు=ప్రాతాదిగనుక నాద్యక్షరశేషము, కెం + చిగురు =అనుస్వారము ద్రుతతుల్యముగాన పరుషమునకు సరళాదేశము. కెంజిగురని యాయెను.

సీ. చలువలఱేఁడు| వె ♦ న్నెలఱేఁడు |రేఱేఁడు|
జాబిల్లి|రేవెల్గు|♦ చందమామ|
తమ్ముల పగవాఁడు|♦ కమ్మవిల్తునిమామ|
కలువలఱేఁడు| పా ♦ ల్కడలిపట్టి|
జక్కవకవవిప్పు|♦ ముక్కంటి తలపువ్వు|
చుక్కలదొర|ప్రొద్దు ♦ జోడుకోడె|
తపసికన్నాప|బి ♦ త్తరిజింక తాలుపు|
కటివేల్పుడాకన్ను| ♦ కడలివెన్న|
తే. పంటపైరులయెకిమీఁడు|♦ జంటదంట
చాకములపాళ్ళ తెలిముద్ద|♦ చలివెలుంగు
వేలుపులబువ్వ|చీఁకటి ♦ వేరువిత్తు|
నెల|యనఁగ జంద్రు పేళ్ళొప్పు ♦ (నీలకంఠ). 1

టీ. చలువలఱేఁడు = చల్లదనముగలరాజు, వెన్నెలఱేఁడు = వెన్నెల కధిపతి, రేఱేఁడు=రాత్రికినాధుఁడు, జాబిల్లి = (జాను + అందమైన బింబము, రేవెల్గు = రాత్రియందుఁ బ్రకాశించువాఁడు, మామ, (చంద్రమస్ శబ్దభవము.) తమ్ములపగవాఁడు = కమలముల విరోధి, కమ్మవిల్తుని మామ = మన్మథునికి మామ, కలువలఱేఁడు = కలువలకు రాజు, పాల్కడలిపట్టి = క్షీరసముద్రుని పుత్త్రుఁడు, జక కవవిప్పు=చక్రవాకమిథునమును వియోగపఱచువాఁడు (రాత్రులయు చక్రవాక దంపతులు గలిసియుండవు.) ముక్కంటి తలపువ్వు = ఈశ్వ శిరోభూషణ మయినవాఁడు, చుక్కలదొర = నక్షత్రములకురాజు, ప్రొ జోడుకోడె = సూర్యునితో సమానుఁడగు వీరుఁడు. తపసికన్నాప = అత్రిమునీంద్రునియొక్క నేత్రమునఁ బుట్టినచిన్నవాఁడు, బిత్తరిజింకతాలుపు

సోగసైన మృగంబును దాల్చినవాడు, (మృగాంకుఁడు)కతి వేల్పు డాకన్ను= విష్ణునకు యెడమ నేత్రము, కడలివెన్న = సముద్రమునందలి వెన్న (పాల సముద్రము చిలుకునప్పుడు పుట్టుటచేతరంగునుబట్టి వెన్నయని చెప్పఁబడియె). ౦టపైరుల యెకిమీడు = సస్యములకురాజు, జంటదంట చౌకముల గాళ్ళతెలిముద్ద = పదునారు కళలుగల తెల్లనిబింబము, (జంట=రెండు, దంట = రెండు, చౌకము = నాలుగు, రెండురెండులు నాలుగు, నాలుగునాలుగులు పదునాఱు) $(2\times2\times4=16)$ చలివెలుంగు = చల్లని కిరణములు గలవాఁడు, వేలుపులబువ్వ = దేవతలకాహారమైన వాఁడు, చంద్రుని కళలలో 15 కళలను దిన దిన మొక్కొక్క దేవత పానము చేయుచున్నదని (శ్రుతి.) చీఁకటివేరువిత్తు = చీఁకటిని బోఁగొట్టువాఁడు, అను నీ 24 ను చంద్రుని పేళ్ళు.

సీ. వెన్నునివలకన్ను ♦ వేఁడి వేలుపు ప్రొద్దు
తొలవలరాయిడికాఁడు ♦ పవలు సేయు
వేలుపు పచ్చగు ♦ ఱ్ఱాలవజీరుండు
వేఁడివెలుంగు రే ♦ వెల్గుజోడు
జంటాఱుమేనుల ♦ సామి చీఁకటిగొంగ
యెఱ్ఱనివేలుపు ♦ నివముసూడు
చదలుమానికము ప్రాఁ ♦ జదువుల పెట్టియ
యేడుగుఱ్ఱముల తే ♦ రెక్కుజోదు
మువ్వేలుపులయిక్క ♦ మొక్కుల దేవర
గాముల ఱేఁడు జ ♦ క్కవల ఱేఁడు
వేయిచేతుల ఱేఁడు ♦ వెలుఁగుల యెకిమీఁడు
చెయువులసాకిరి ♦ చాయమగఁడు

తే. మింటి తెరువరి| తమ్మి వా ♦ ల్గంటిమగఁడు
పోరనీల్గెడు మొనగాండ్రు ♦ పోవుదారి|
జగముచుట్టంబు| జమునయ్య ♦ జగముకన్ను|
నాఁగ సూర్యుని పేళ్లొప్పు ♦ (నాగభూష) 16

టీ. వెన్నునివలకన్ను=విష్ణువుయొక్క కుడికన్ను, వేఁడివేలుపు= వెచ్చదనముగల దేవుఁడు, పాఁడ్డు, (బ్రధ్నశబ్దభవము). తొవలరాయిడికాఁడు = కలువలకు విరోధి, పవలుసేయువేలుపు = దినకరుఁడు, పచ్చగుఱ్ఱములవజీరుండు = పచ్చగుఱ్ఱముల నెక్కెడిరౌతు, వేఁడివెలుఁగు= వేఁడి కిరణములు గలవాఁడు, రేవెల్గుజోడు = చంద్రునికి సమానుఁడు, జంట[illegible] మేనులసామి = పండ్రెండుదేహములుగల దేవుఁడు (ద్వాదశాత్ముఁడు) చీఁకటిగొంగ = చీఁకటినిబోఁగొట్టువాఁడు, ఎఱ్ఱనివేలుపు = ఎఱ్ఱని దేహముగల దేవుఁడు, ఇవమునూడు = మంచును బోఁగొట్టువాఁడు, మిన్ను మానికము = ఆకాశమునకు రత్నము, ప్రాఁజదువుల పెట్టియ = వేదములకునికిపట్టు, ఏడుగుఱ్ఱముల తేరెక్కుజోదు, (సప్తాశ్వుఁడు) మువ్వేలుపులయెక్క = త్రిమూర్తులకుఁ దావరమైనవాఁడు, మొక్కులదేవర = నమస్కారములకుఁ బ్రియుఁడయిన దేవుఁడు, గాముల ఱేఁడు = గ్రహములకు రాజు, (గాము. ప్రకృతి. గ్రహము). జక్కవల ఱేఁడు = చక్రవాకముల కధిపతి, వేయిచేతుల ఱేఁడు=సహస్రకిరణుఁడు, వెలుఁగులయొకిమీఁడు = వెలుతురుల కన్నిటికిఁ బ్రభువు, చెయువులసాకిరి = కర్మలకు సాక్షిభూతుఁడు, చాయమగఁడు = ఛాయాదేవికిఁ బెనిమిటి, మింటితెరువరి = ఆకాశమునఁ దిరుగు బాటసారి, తమ్మివాల్గంటిమగఁడు = పద్మినియను కాంతకు (పెనిమిటి) పోరనీల్గెడు మొనగాండ్రు పోవుదారి = యుద్ధమునఁ జచ్చిన వీరులు స్వర్గలోకమునకుఁబోవు మార్గమైనవాఁడు, (యుద్ధమునఁ జచ్చిన శూరులును, యోధులును సూర్యమండలమును భేదించికొని స్వర్గమునకుఁబోవుదు.

రని శ్రుతి) జగము చుట్టంబు = లోకబాంధవుఁడు, జమునయ్య = యమునకుఁ దండ్రి, (జముఁడు—ప్రకృతి = యముఁడు) జగముకన్ను = లోకమునకు నేత్రము అను ౫౽ యును సూర్యునికి నామములు.

సీ. చట్టుపల్ దెగగట్లఁ ♦ గొట్టెడు జెట్టి| నూ
అంచులవాలు చే ♦ మించుజోదు|
దుగబోట్లపిటేఁది య్యై ♦ దుకనుంగవల వేల్పు|
పాఱుతపసియింటి ♦ పంచకోడి|
వెడలిచూపాడయఁ డె| ♦ క్కుడు మొగుల్ గలపోడ|
నిక్కుపీనులజక్కి ♦ నెక్కురౌతు|
తెల్లయేనుఁగు నెక్కి ♦ తిరిగెడుదొర| తూర్పు
మాగానియేలెడు ♦ మణియకాఁడు|

తే. జమిలిచౌపంచపదులు జ ♦ న్నములు సేసి
నట్టివేలుపు| సోమాసి ♦ పెట్టుఁజెట్టు|
పొట్టితమ్ముఁడు గల్గిన ♦ యట్టివేల్పు|
నాఁగ నింద్రుని పేళ్ళొప్పు ♦ (నాగభూష). 17

టీ. చట్టుపల్ దెగగట్లఁగొట్టెడు జెట్టి = పర్వతములయొక్క ఱెక్కల ఛేదించినదిట్టరి, నూఅంచులవాలు చే మించుజోదు = నూఅంచులుగల వజ్రాయుధము చేత మించినయోధుఁడు, దుగబోట్లపిటేఁదియ్యైదు కనుంగవల వేల్పు = సహస్రనేత్రుడు, దుగబోట్లపిటేదియైదు అనఁగా ఐదునూఱులు రెండు రెన్నులు వెనుకఁగల యైదు-500, వానికవలు = వానిజత - 500 × 1000 వేయి, పాఱుతపసియింటిపంచకోడి = బ్రహ్మర్షియైన గౌతముని ఇంటను గోడిరూపము నెత్తినవాఁడు, ఒడలిచూపాడయఁడు = దేహమంతయు

గన్నులుగలదొర, ఎక్కుడు మొగుల్ గలప్రోడ=మేఘములే వాహనములుగాఁగల నేర్పుకాఁడు, (ప్రౌఢ-వికృ. ప్రోడ) నిక్కువీనులజక్కి నెక్కురౌతు= నిక్కుచెవులవాహనమును (ఉచ్చైశ్శ్రవమను గుఱ్ఱమును) ఎక్కునట్టి దిట్టరి, తెల్లయేనుఁగు నెక్కి తిరిగెడుదొర=ఐరావతమను గజము నెక్కి సంచరించెడు ప్రభువు, తూర్పు మాగాణియేలెడు మణియకాఁడు = తూర్పుదిక్కును పాలించెడి యుద్యోగస్థుఁడు, జమిలిచాప చపదులు జన్నములు సేసినట్టి వేలుపు = నూఱుయాగములు చేసిన దేవుఁడు, (జమిలి = రెండు, చాపంచ = ఐదు, రెండుఐదులు = పది, పదిపదులు = నూఱు) సోమాసిపెట్టుఁజెట్టు = సోమయాజులపాలిటి కల్పవృక్షము, (సోమాసి-ప్రకృతి-సోమయాజి) పొట్టితమ్ముడు గన్నయట్టి వేల్పు = వామనునిదమ్మునిగాఁ గలవాఁడు అను నీ ౧౭ ను ఇంద్రుని పేళ్లు.

ఆ. నీరుపాప|గాలి ♦ నెచ్చెలి |యన్నింటి
తిండికాఁడు| కప్పుఁ ♦ దెరువుజాడ|
యంటరాని వేల్పు| ♦ జంటమోముల సామి|
యగ్ని|యనఁగ నొప్పు ♦ ననలు (డీశ). 18

టీ. నీరుపాప=నీటియందుబుట్టిన బిడ్డఁడు, గాలి నెచ్చెలి = వాయుసఖుఁడు, అన్నింటి తిండికాఁడు _ సర్వమును దినువాఁడు, కప్పుదనరు జాడ = నల్లని మార్గముకలవాఁడు (కృష్ణవర్త్మ) అంటరాని వేల్పు = తాఁకుటకు వీలుపడని దేవుఁడు, జంటమోములసామి = రెండుముఖములు గల వేలుపు. అగ్గి (అగ్నిశబ్దభవము) ఈ ౭ ను అగ్నిహోత్రుని నామములు.

తే. జమునసైదోడు| పెతరుల ♦ సామి|జముఁడు|
ప్రొద్దుకొమరుఁడు| గుదెతాల్పు| ♦ పోతుజక్కి
నెక్కి యాడెడుబలురౌతు| ♦ దక్కిణంపు
సామి |యన నంతకుం డొప్పు ♦ (శ్రీమహేశ.) 19

టీ. జమున సైదోడు = యమునకుఁ దోఁబుట్టినవాఁడు, పెతరుల సామి = పితృదేవతలకుఁ బ్రభువు, (పెతరులు - ప్రకృతి పితరులు) జముఁడు, (యముఁడు-వికృతి. జముఁడు) ప్రొద్దుకొమరుఁడు = సూర్యుని కొడుకు, గుదెతాల్పు = గుదెనుధరించినవాఁడు, పోతుజక్కినెక్కి యాడెడు బలురౌతు = దున్నపోతు నెక్కెడి బలిమిగల దిట్టరి, దక్కిణంపు సామి=దక్షిణ దిశ నేలువాడు. ఈ ౮ ను యముని నామములు.

ఆ. మూలఱేఁడు సోఁకు ♦ మూఁకలఱేఁడు రే
ద్రిమ్మరీఁడు పొలసు ♦ దిండిపోఁతు
రక్కసుండు నల్ల ♦ ద్రావువాఁడనఁగను
నిరృతిపేళ్ళు సెల్లు ♦ (నీలకంఠ). 20

టీ. మూలఱేఁడు=నిరృతిమూల కధిపతి, సోఁకుమూకల ఱేఁడు= రాక్షసుల సేనలకు రాజు, రేద్రిమ్మరీఁడు = రాత్రులందు దిరుగువాఁడు, పొలసు తిండిపోఁతు = మాంసమును దినువాఁడు రక్కసుఁడు, (రాక్షస శబ్దభవము) నల్లద్రావువాఁడు = రక్తపానము చేయువాఁడు. ఈ ౬ ను నిరృతికిఁ బేళ్ళు.

ఆ. మేటినీరుచూలి ♦ మెయితాలుపులసామి
వల్లెత్రాడుదాల్పు ♦ నీళ్ళరాయఁ
డేటిబోఁటిమగల ♦ యెకిమీఁడు పడమటి
దొర యనంగ నొప్పు ♦ వరుణుఁ (డీశ). 21

టీ. మేటినీరుచూలి మెయితాలుపులసామి = విస్తారజలముగల సముద్రమునందుఁ బుట్టిన దేహములు గల జంతువులకు (అనఁగా జలజంతువులకు) ఱేఁడు, వల్లెత్రాడుతాల్పు = పాశమనెడు ఆయుధముఁ దాల్చినవాఁడు, నీళ్ళరాయఁడు=ఉదకములకు రాజు, ఏటిబోఁటిమగల యెకిమీఁడు = నదు

లకు భర్తలైన సముద్రములకు రాజు, పడమటిదొర=పడమటి దిక్కు నేలు రాజు - ఈ ౫ను వరుణునికిఁ బేళ్ళు.

సీ. వడిగలజింక త ♦ త్తడి నెక్కునెఱరౌతు
మేటిపాముల మేఁత ♦ నీటితాత
యొడలితాల్పులపిండు ♦ కుసు రగుబలియుండు
సోఁకుదయ్యము మింటి ♦ చూలి గాలి
కరువలి తెమ్మెర ♦ గాడ్పు పయ్యర యొంటి
మాలికుల పెనుముప్పు ♦ మబ్బువిప్పు
సురటివీవులఁబుట్టు ♦ సుడిగొట్టు చలినట్టు
బక్కవారల పేను ♦ బాద యీఁద

తే. అబ్బురపుఁ దియ్యవిలుకాని ♦ నిబ్బరంపు
దెబ్బపోరుల నలయిక ♦ ప్రబ్బుబోంట్ల
గబ్బిగుబ్బల చెమటల ♦ యుబ్బడంచు
గబ్బినాఁజను మారుతా ♦ ఖ్యలు (మహేశ) 22

క. మరుతాఖ్య లొప్పచుండును
ధర వినుచూలి యనసోఁకు ♦ దయ్యమనం బ
య్యెరయన గొట్టన సీఁదనఁ
గరువలి యనఁ దెమ్మెరనఁగ ♦ గాలియనంగన్. 23

టీ. వడిగలజింకత త్తడినెక్కు నెఱరౌతు=వేగముగల లేడి యను వా
హనము నెక్కెడి నేర్పరియగు దిట్టరి, మేటిపాముల మేఁత = శ్రేష్ఠము
పాములకు ఆహారమైనవాఁడు, నీటితాత=ఉదకములకుఁ దాత, ఒడలితాల్పుల
పిండు కుసురగు బలియుండు=దేహధారులకు ప్రాణమై

(అనగా జగత్ప్రాణుఁడు) సోఁకుదయ్యము = స్పర్శగుణముగల దేవుఁడు, మింటిచూలి = ఆకాశంబునఁ బుట్టినవాఁడు, గాలి, కరువలి, తెమ్మెర, గాడ్పు, పయ్యర, ఒంటిమ్రాకుల పెనుముప్పు = ఒంటరిగానున్న చెట్లకు మిక్కిలి బాధగలిగించువాఁడు, మబ్బువిప్పు = మబ్బులను జెదరఁగొట్టు వాఁడు, సురటివీవులబుట్టు = సురటివీచుటచేఁ బుట్టువాఁడు, సుడిగొట్టు= గుండ్రముగా వీచువాఁడు, చలిపట్టు = శీతమున కునికిపట్టు, బక్కవాదల పెనుబాద=కృశించినవారికి మిక్కిలి బాధాకరుఁడు, (బాద-బాధాశబ్దభవము) ఈఁద, అబ్బురపు దియ్యవిలుకాని నిబ్బరంపు దెబ్బపోరుల నలయిక ప్రబ్బుబోఁట్ల గబ్బిగుబ్బల చెమటల యుబ్బడంచుగబ్బి= ఆశ్చర్యకరములైన మన్మథునియొక్క గొప్ప దెబ్బలుగల యుద్ధములయందు (సంభోగములయందు) మిక్కిలి యలసిన స్త్రీలయొక్క గొప్పస్తనములమీఁది చెమటయొక్కయాధిక్యమునుపోఁగొట్టెడిగొప్పవాఁడు, వినుచూలి=ఆకాశమున బుట్టిన దేవుఁడు, గొట్టు - ఈ ౨౧ యును గాలికిఁ బేళ్ళు.

క. ముక్కంటి యనుఁగుజెలి|వడ
చక్కెలిక|చాగకాఁడు|♦ జక్కులదొర|బల్
రొక్కమెకిమీఁడు|మానిసి
నెక్కెడువాఁడ|నఁగ జను ధ ♦ నేశుం (డభవా). 24

టీ. ముక్కంటియనుఁగుజెలి = ఈశ్వరునికి ముఖ్యహితుఁడు, వడచక్కెలిక = ఉత్తరదిక్కు నేలెడి ప్రభువు, * చాగకాఁడు = ధనమొసఁగువాఁడు, జక్కులదొర=యక్షులకురాజు, బల్ రొక్కమెకిమీఁడు = అధికధనమునకు రాజు, మానిసి నెక్కెడువాఁడు = నరవాహనుఁడు- ఈ ౬ ను కుబేరుని నామములు.

---

వాయువుపేళ్ళలో సీసపద్యమునలేని 'గొట్టు' అనుపదము మాత్రమే కందపద్యమున నుండుటచే పద్యద్వయమును జేర్చి యర్థము వ్రాయఁబడినది.

* తేగకాఁడు-అని పా.

క. విడిముడి గలవేలుపు చెలి|
జడముడి జంగంబు|గడదె ♦ సంగాపరి యా
యొడయండు పాఁపతొడవుల
నిడియెడివేల్పనఁగ నొప్పు ♦ నీశానుఁ డిలన్. 25

టీ. విడిముడిగల వేలుపుచెలి=రొక్కముగల వేల్పునకు (కుబేరునకు) మిత్రుఁడు, జడముడి జంగంబు= జడలను దాల్చిన బిచ్చగాఁడు. కడదెసంగాపరియౌ యొడయండు=కడపటి దిక్కగునీశాన్యదిక్కు నేలెడు ప్రభువు. పాఁపవతొడవుల నిడియెడు వేలుపు = పాముల సొమ్ములుగఁ దాల్చెడి దేవుడు. ఈ ౪ ను ఈశానుని పేరులు.

క. దేవాల యాహ్వయంబులు
కోవెల|యన|దేవళంబు|♦ గుడి నా వెలయున్
దేవళ్ళన జేజేలనఁ
గా వేలుపు లనఁగ వెలయు ♦ గ్రతుభుగభిఖ్యల్. 26

టీ. కోవెల, దేవళంబు, (దేవాలయశబ్దభవము) గుడి, ఇవి 3 ను దేవాలయమునకు బేరులు. దేవళ్ళు, (దీనికి ఏకవచనము దేవర) జేజేలు, వేలుపులు, అను నీ మూఁడును దేవతలకుఁ బేరులు.

ఆ. క్షితిని బేళ్ళు దనరు ♦ సీఁద్రంపుఁబెద్ద! బల్
పాపతేఁడు| వెన్ను ♦ పాను పనఁగ|
బుడమితాలుపనఁగ| ♦ దడవులనిడుపఁడు|
చిలువతేఁడనంగ ♦ శేషునకును. 27

టీ. సీఁద్రంపుపెద్ద=కుబుసముగల గొప్పవాఁడు, బఁల్పాఁపతేఁడు=పాముల పెద్దలకుఁ బెద్దదైనపాము, వెన్నుపానుపు=విష్ణువుయొక్క పఱుపు

పుడమితాలుపు = భూమినిమోయువాఁడు. తడవులనిడుపఁడు = చిరకాల జీవి, చిలువఱేఁడు = సర్పనాయకుఁడు, ఈ ౬ ను ఆదిశేషునకుఁబేరులు.

క. మరునయ్య తేజి| పులుఁగుల
దొర |పాములవేటకాఁడు| ♦ ♦ తూరుపునాఁడేల్
దొరబువ్వఁ గొన్నలావరి
గరుటామంతుఁ డన నొప్పు ♦ గరుడుం (డభవా) 28

టీ. మరునయ్య తేజి = మన్మథునితండ్రి యగు విష్ణునకు వాహనము, పులుఁగులదొర = పక్షులకుఁ బ్రభువు, పాములవేఁటకాఁడు= పాములనుఁ జంపువాఁడు, తూరుపునాఁడేలు దొరబువ్వఁ గొన్నలావరి = పూర్వదిశను బాలించుదేవుఁ డగు నింద్రుని యాహారం బగు అమృతమును దెచ్చినబలవంతుఁడు, గరుటామంతుఁడు (ప్రకృతి గరుత్మంతుఁడు) ఈ ౫ ను గరుత్మంతునిపేళ్ళు)

ఆ. నల్లవలువతాల్పు| ♦ తెల్లనిమైదంట|
వెన్నదొంగయన్న| ♦ వెఱ్ఱినీళ్ళ
మేలువాఁడు|దుక్కి ♦ వాలుదాలుపు| తాటి
పడగవాఁ డనంగ ♦ బలుఁడు (రుద్ర) 29

టీ. నల్లవలువతాల్పు=నల్లనిబట్టఁ దాల్చినవాఁడు, తెల్లనిమైదంట= తెల్లనిదేహముగలదిట్టరి, వెన్నదొంగయన్న=కృష్ణుని యన్న, వెఱ్ఱినీళ్ళ మేలువాఁడు=కల్లునందాసక్తిగలవాఁడు, దుక్కివాలుదాలుపు = నాఁగేలాయుధముగాఁ గలవాఁడు, తాటిపడగవాఁడు = తాళధ్వజముగలవాఁడు ఈ ౬ ను బలరాముని పేర్లు.

క. వడముడి |యనఁగా గాడుపు
కొడు కన నివి రెండుఁ బేళ్ళ ♦ గున్ భీమునకుం

ఆ. పుడుకుఁదోఁడుకు| వేలు ♦ పులగిడ్డి| వెలిమొద
వు|నఁగ గామధేను ♦ వలరుచుండు
గల్పకంబుదనరు ♦ వేల్పుఁజెట్టు| పుల
మ్రాను| వెల్లమ్రాను| ♦ నా (సుమేశ) 35

టీ. పుడుకుదోఁడుకు = కోర్కులనొసంగునట్టియావు, వేలుపులగిడ్డి దేవతలయావు, వెలిమొదవు = తెల్లనియావు - ఈ 3 ను కామధేనువునకుఁ బేళ్ళు. వేల్పుఁజెట్టు = దేవతలవృక్షము. వెల్లమ్రాను = తెల్లని చెట్టు, ఈవులమ్రాను=కోరికలొసంగెడు చెట్టు, ఈ 3 ను కల్పవృక్షమునకుఁ బేళ్ళు.

ఆ. అవని గుదుసుకైదు♦ వు|నఁగ వేయంచుల
కైదు|వనఁగ జుట్టుఁ ♦ వ|నఁగ
బటువుగైదు వు|నఁగ, ♦ బరఁగు సుదర్శన
చక్రమునకుఁ బేళ్ళు ♦ (చంద్రమౌళి) 36

టీ. గుదుసుకైదువు = గుండ్రనియాయుధము, వేయంచులకైదువు= వేయిమొనలుగల యాయుధము,చుట్టుఁగైదువు=గుండ్రమైన యాయుధము బటువుఁగైదువు=దిట్టమైనయాయుధము ♦ ఈ ౪ ను విష్ణుచక్రమగు సుదర్శనమునకుఁ బేళ్ళు.

---

వేల్పుఁజెట్టు - వేల్పు+చెట్టు సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం, బుంపులకుం, బరుషసరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు బా. సంధి 25-చే "వేల్పుజెట్టు" అని రూపము. ఇట్లే పుడుకుఁదోఁడుకు.

♦ చుట్టుగైఁదువు - బటువుఁ గైదువు—పైసూత్రమే.

ఆ. వలమురి|యనఁ జుట్టు ♦ వాలు జోడ|నఁ గల్మి
కొమ్మమగని బూర ♦ గొమ్మ|నంగ
దనరుఁ బాంచజన్య ♦ మునకు నభిఖ్యలు
(ధృతకురంగ ధవళ ♦ వృషతురంగ). 37

టీ. వలమురి = కుడితట్టుగాఁ దిరిగియుండునది, చుట్టువాలుజోడు= సుదర్శనమునకుఁ దోడయినది, కల్మికొమ్మ మగని బూరగొమ్మ = లక్ష్మీదేవిభర్త పూరించెడి వాద్యవిశేషము-అను నీ 3 ను పాంచజన్యమనెడిశంఖమునకుఁ బేళ్ళు.

తే. రిక్క|లనఁ జుక్క|లనఁగను ♦ ఋక్షములకు
నాఖ్యలై యొప్పుఁ దెఱగంటి యన్ను|లనఁగ
నచ్చరల|నఁగ వేలుపు ♦ మచ్చకంటు
లనఁగ సురకాంతలకు నాఖ్య ♦ లగు (గిరీశ). 38

టీ. రిక్కలు, (ఋక్షశబ్దభవము.) చుక్కలు-అను నీ ౨ ను నక్షత్రములకుఁ బేళ్ళు. తెఱఁగంటియన్నులు = తెఱ్ఱకన్నులుగల దేవతలస్త్రీలు, అచ్చరలు, (అప్సరశ్శబ్దమునకు వికృతి.) వేలుపు మచ్చకంటులు = దేవతల స్త్రీలు-ఈ 3 ను అప్సరసలకుఁ బేరులు.

తే. పవలు| పగ|లనఁ బేళ్లొప్పు ♦ దినమునకును
రాత్రిపేళ్లొప్పు రే రేయి| ♦ రాతి ర|నఁగ
వెలయుచుండును రేయెండ| ♦ వెన్నె|లనఁగఁ
జంద్రికకును సమాఖ్యలు ♦ (చంద్రమౌళి). 39

టీ. పవలు, పగలు-ఈ ౨ దినమునకుఁ బేర్లు. రే, రేయి, రాతిరి-ఈ 3 ను రాత్రికిఁ బేర్లు. రేయెండ=రాత్రులందుగాయు నెండ, వెన్నెల=తెల్లని చంద్రుఁడు గలది-(వెలి + వెల్ల గలది) ఈ ౨ను చంద్రకాంతికిఁ బేరులు.

క. మించు లన మెఱుపు। లనఁగను
జంచల। లనఁ బేళ్లు దనరు ♦ జలధరములు రా
ణించుం బలుకంగ మొయి
ళ్ళంచు। మొగుళ్ళంచు। మబ్బు ♦ లంచున్ (భర్గా). 40

టీ. మించులు, మెఱుపులు - ఈ ౨ ను మెఱుపులకుఁ బేళ్లు. మొయిలు, మొగులు, మబ్బు ఈ 3 ను మేఘములకుఁ బేర్లు,

క. తొలుచదువులు। ప్రాఁజదువులు।
దొలుమినుకులు। ప్రామినుకులు। ♦ దొలుపలుకులు। ప్రాఁ
బలుకులు। ♦ *పెనుమినుకులు। నా
వెలయున్ శ్రుతులకునుఁ బేళ్ళు ♦ (విశ్వాధిపతీ). 41

టీ తొలుచదువులు, ప్రాఁజదువులు, తొలుమినుకులు, ప్రామినుకులు, తొలుపలుకులు, ప్రాఁబలుకులు (ఈ యాఱుపదములకును 'ఆదివాక్యము' లని యర్థము) పెనుమినుకులు = విస్తారవాక్యములు అను నీ ౭ ను వేదముల పేర్లు

క. ఇది దేవవర్గు దీనిం
జదివిన వ్రాసినను వినిన ♦ జనులకు నిత్యా
భ్యుదయంబు లొసఁగుచుండును
వదలక కాశీనివాస ♦ వాసుఁడు పేర్మిన్. 42

టీ. ఈదేవవర్గు నెవరువ్రాయుచున్నారో, ఎవరు చదువుచున్నారో ఎవరు వినుచున్నారో, వారికిఁ గాశీవిశ్వేశ్వరుఁడు గరుణించి యెడతెగని సంపద లొసఁగును.

దేవవర్గు సమాప్తము.

---

* పెనుఁబలుకులు; అని పా.

# మానవవర్గు.

---

తే. పాఱుఁ| డనఁగ బుడమివేల్పు| ♦ బాఁపఁ| డనఁగ
జన్నిగట్టన| విప్రుండు ♦ జగతిఁ బరఁగు
నొడయఁ| డేలిక| యెకిమీఁడు| ♦ పుడమిఱేఁడు|
ఱేఁడు| దొరసామి| యన నొప్పు ♦ నృపతిపేళ్ళు. 1

టీ. పాఱుఁడు, పుడమివేల్పు = భూదేవుఁడు, బాఁపఁడు, జన్నిగట్టు = యజ్ఞోపవీతము ధరించువాఁడు-ఈ ౪ ను బ్రాహ్మణుని పేర్లు. ఒడయఁడు, ఏలిక, ఎకిమీఁడు, పుడమి ఱేఁడు= భూపాలుఁడు, ఱేఁడు, సామి, (స్వామి శబ్దభవము) దొర-ఈ ౭ ను రాజుపేళ్ళు.

సీ. కోమట్లు| మూఁడవ ♦ కొలమువాండ్రన| బేరు
లన| వైశ్యనామము ♦ లనరుఁగాఁపు
వాండ్రు| నా నాలవ ♦ వాండ్రు| నా బలిజెవాం
డ్రనఁ| జను శూద్రస ♦ మాహ్వయములు
వడుగు| నా గోఁచిబాఁ ♦ పఁడు| నాఁగ బ్రహ్మచా
రికిఁ బేళ్ళు నడచు ధ ♦ రిత్రియందు
నాలుబిడ్డలు గల ♦ యతఁ డిలుఱేఁడు| గే
స్తన| నొప్పుఁ బేళ్ళు గృ ♦ హాధిపతికి

ఆ. నడవిమనికిపట్టు| ♦ జడదారి| యన వన
వాసి యొప్పు నిల్లు ♦ వాసి తిరుగు
బోడ తపసి| కావి ♦ పుట్టగోఁచులసామి|
యనయతీంద్రుఁ డలరు ♦ (నలిక నేత్ర)

టీ. కోమట్లు, మూఁడవకొలమువారు, బేరులు, ఈ 3 ను వైశ్యునిపేళ్ళు. కాఁపువాండ్రు, నాలవవాండ్రు, బలిజెవాండ్రు-ఈ 3 ను శూద్రునిపేళ్ళు, వడుగు, గోచిబాఁపఁడు-ఈ ౨ ను బ్రహ్మచారికిఁ బేర్లు, ఆలుబిడ్డలుగల యతఁడు = పెండ్లాము బిడ్డలు గలవాఁడు, ఇలుఱేఁడు = ఇంటి యజమానుఁడు, గేస్తు. (గృహస్థశబ్దభవము.) ఈ 3 ను గృహస్థునిపేళ్లు, అడవి మనికిపట్టు = అరణ్యమునందుండువాఁడు, జడదారి = జడలను ధరించినవాఁడు ఈ ౨ ను వానప్రస్థునికిఁ బేరులు. ఇల్లువాసి తిరుగు = ఇంటిని విడిచిపెట్టి తిరుగునట్టివాఁడు, బోడ, తపసి, కావిపుట్టగోఁచుల సామి = కావిరంగుగల పుట్టగోఁచులను బెట్టుకొనువాఁడు - ఈ ౪ ను సన్న్యాసికిఁ బేరులు.

సీ. అమ్మ|నాఁ దల్లి|నా ♦ నవ్వ|నా గన్నది|
యన మాతృ కాఖ్యలౌ ♦ (నభ్రకేశ)
అబ్బ|నాయన |యయ్య|♦ యనఁ దండ్రి|యన నప్ప|
యన జనకాఖ్య లౌ ♦ (నగనివేశ)
తోడఁ బుట్టనఁగ|నై ♦ దోడు|తోఁబుట్టన|
సోద రాహ్వయము లౌ ♦ (నాదిదేవ)
భర్తృసహోదరు ♦ భార్యకుఁ దోడికో
డ ల|న నేరా ల|న ♦ నలరు (నభవ)

తే. చెలియ/లనఁ జెల్లె ల/నఁగను ♦ వెలయుచుండు
నాహ్వయములు కనిష్ఠక ♦ న్యకు (గిరీశ)
జ్యేష్ఠకన్యకు నాఖ్యలై ♦ క్షితిని వెలయు
నప్ప/యన నక్క/ యనఁగఁ (జం ♦ ద్రార్ధమకుట.) 3

టీ. అమ్మ, (ప్ర-అంబ) తల్లి, అవ్వ, కన్నది-ఈ ౪ ను మాత కు బేరులు. అబ్బ, నాయన, అయ్య, ఆర్యశబ్దభవము.) తండ్రి, అప్ప-ఈ

గనుతండ్రికిఁ బేళ్ళు. తోడఁబుట్టు-పాఠాంతరము, తోడఁబుట్టుగు, తోడబుట్టువు, సైదోఁడు, తోఁబుఁట్టువు, పా. తోఁబుట్టుగు-ఈ 3 ను సోదరునికిఁ బేళ్ళు. తోడి కోడలు = తనతోసమానురాలగు కోడలు. ఏరాలు=అన్యుని భార్య (ఎరవు+ఆలు)-ఈ 2 ను తోడికోడలికిఁ బేరులు. చెలియలు, చెల్లెలు-ఈ 2 ను చిన్నఆడుతోఁబుట్టువునకుఁ బేరులు. అప్ప, అక్క= ఈ 2 ను పెద్దయాడుతోఁ బుట్టువునకుఁ బేరులు.

సీ. ముగ్ధకుఁ బేళ్ళగు ♦ ముగుద యనన్ ముద్ద
  రాలు నా గోల నా ♦ బేల యనఁగ
గట్టివాయి యనంగ ♦ గయ్యాళి యనఁగ
  యన ధూర్తసతికి నా ♦ హ్వాయము లమరు
నైదువ నాఁగము ♦ త్తైదువ నా నయి
  దువరాలు నాఁ బుణ్య ♦ యువతి వెలయు
మృతచిరంటికి నాఖ్య ♦ లెసఁగు బేరంటాలు
  నాఁగను జక్కని ♦ నా ధరిత్రి
తే. గేస్తురా లనునాఖ్యచే ♦ గృహిణి వెలయు
  నాలు పెండ్లాము రాణి యి ♦ ల్లాల నంగ
  భార్య దనరును దొత్తన ♦ బాని సె యన
  వరవు డన దాసికాఖ్యలౌ ♦ (గరళకంఠ). 4

టీ. ముగుద, (ముగ్ధశబ్దభవము). ముద్దరాలు, గోల, బేల, ఈ 4 ను బదునాలు వత్సరముల వయస్సుగల పడుచునకుఁ బేరులు: గట్టివాయి =

(ముద్ద + ఆలు—పేదాదిశబ్దంబుల కాలుశబ్దంబు పరంబగునపుడు కర్మధారయమందు రు గాగమంబగు" అను బాల. సంధి 30 సూ చే 'ర' అని ఆగమము.

(అయిదవ + ఆలు = అయిదువరాలు = మంగళ సూత్రము, పసుపు, కుంకుమము, గాజులు, చెవ్వాకు అను నైదు వస్తువులు గలది).

పెద్దనోరుగలది, గయ్యాళి, జాఁగ-ఈ 3 ను ధూర్తస్త్రీకిఁ బేరులు. ఐదువ, ముత్తైదువ, అయిదువరాలు ఈ 3 ను సుమంగలియగు స్త్రీకిఁ బేరులు. పేరంటాలు, జక్కిని-ఈ 2 ను మృతినొందిన దీర్ఘసుమంగలి పేర్లు. గేస్తురాలు (గేస్తు + ఆలు,) పెండ్లాము, రాణి, ఇల్లాలు-ఈ 4 ను భార్యకుఁ బేర్లు. తొత్తు బానిసె, వరవుడు ఈ 3 ను దాసికిఁ బేర్లు.

సీ. కన్నియ|కన్నెనాఁ గన్యకుఁ బేళ్లొప్పు
జవరాలు|కొమరాలు|♦ జవ్వని|యనఁ
దనరు యువతి|ప్రోడ |♦ యన గట్టివయసుది|
యన ప్రౌఢ దాల్చు నీ ♦ యాహ్వయములు
ముసలి|మిండలకోర |♦ ముప్పదియాఱేండ్లు
చనినది|యనుపేళ్ళ ♦ నెనయులోల
ముసలిది|ముదుసలి |♦ ముదియ|పెద్దన నివి
యాఖ్యలై తనరు వృ ♦ ద్ధాంగనకును

ఆ. చెడిప|అంకులాడి|♦ చెడ్డతొయ్యలి|వెలి
చవులు గనిన దనఁగ ♦ జారదనరు
నిలను విటులదూత|♦ యెడకాఁడు|కుంటెన
కాఁడనంగఁ దనరు ♦ (గరళకంఠ). 5

టీ. కన్నియ = కన్నె (ప్రి, కన్య.) ఈ 2 ను పెండ్లికానిపడుచు పేరులు. జవరాలు, కొమరాలు, జవ్వని ఈ 3 ను యౌవనవతికి పేరులు. ప్రోడ, (ప్రకృతి. ప్రౌఢ) గట్టివయసుది = దిటవైనవయసుగలది—ఈ 2 ను ముప్పదేండ్ల వయస్సుగలదాని పేరులు. ముసలి, మిండలకోర, ముప్పదియాఱేండ్లు చనినది-ఈ 3 ను లోలస్త్రీకి బేరులు. ముసలిది, ముదుసలి, ముదియ, పెద్ద-ఈ 4 ను వృద్ధాంగనకుఁ బేర్లు. చెడిప, అంకులాడి, చెడ్డతొయ్యలి = చెడుగుణములుగల యాఁడుది, వెలిచవులుగనినది=పరపురుషుల

వలని పొందుమరఁగినది - ఈ ౪ ను వ్యభిచారిణికిఁ బేరులు. ఎడకాఁడు, కుంటెనకాఁడు = విటకత్తెను, విటకాని జేర్చునట్టివాఁడు ఈ ౨ ను విటుని దూత పేర్లు.

తే. వేల్పు బానిసె / వెలయాలు | ♦ వేడ్కకత్తె /
లంజె | బోగముచాన | వె ♦ ల్లాటకత్తె |
పడఁపుజెలి | యాటచేడియ | ♦ గడనకత్తె |
నాగ నివి వేశ్య కాఖ్యలౌ ♦ (నగనివేశ). 6

టీ. వేల్పుబానిసె = దేవతలపనికత్తె, వెలయాలు = వెలకువచ్చెడి యాఁడుది, (వెల + ఆలు = వెలయాలు) వేడ్కకత్తె, లంజె, బోగముచాన = అనుభవించుటకైన స్త్రీ, వెల్లాటకత్తె, -పా పెల్లాటకత్తె = ఎక్కువ నాట్యము చేయునది. పడఁపుజెలి = ద్రవ్యసంపాదనము చేసెడి స్త్రీ, (పడపు + చెలి = (నుగాగమము) ఆటచేడియ = ఆటలాడునట్టి యాఁడుది, గడనకత్తె = సంపాదనచేయు స్త్రీ - ఈ ౯ యు బోగముదాని పేర్లు.

ఆ. వెచ్చకాఁడు / బొజుఁగు | ♦ వేడుకకాఁడు | మిం
డండు | ననుపుకాఁడు | ♦ మిండగీఁడు |
లంజకాఁడు | నాథ ♦ రం జను బల్లవ
నామధేయములు (పి ♦ నాకహస్త). 7

టీ. వెచ్చకాఁడు = ద్రవ్యవ్యయము చేయువాఁడు, బొజుఁగు, (ప్రం. భుజంగుఁడు) వేడుకకాఁడు = సొగసుగలవాఁడు మిండండు, ననుపుకాఁడు = మెత్తదనముగలవాఁడు, మిండగీడు, లంజెకాఁడు = లంజె గలవాఁడు - ఈ ౭ ను విటుని పేళ్ళు.

---

(మతుపర్థమునందు పుంవాచక స్త్రీ వాచకములకు క్రమముగా కాకత్తియలగు. బా. తద్ధి, ౧౧ సూ. చే వేడ్కకత్తెయను రూపము).

గీ. కోడెకాఁడ| నంగ ♦ గోవాళ్ళు| నాఁగను
యువజనాఖ్య లొప్పు ♦ చుండు రెండు
నాగవాస| మనఁగ ♦ నామమగు వేశ్యాజ
నంబు మేళమునకు ♦ (నంబికేశ). 8

టీ. కోడెకాఁడు=యౌవనవంతుఁడు, గోవాళ్ళు = యౌవనము గల వాఁడు, (గోవ + వారలు = గోవాళ్లు. ఈ ౨ ను ప్రాయమువానికిఁ బేళ్లు. నాగవాసము - ఇది వేశ్యాజనమేళమునకుఁ బేరు.

సీ. నెలఁతుక| క్రాల్గంటి |♦ పొలఁతుక| ముద్దియ|
వాలుఁగంటి |మగువ |♦ పడఁతి| మడఁతి|
చెలి| మచ్చికంటి| యు ♦ గ్మలి |యింతి |తొయ్యలి|
నవలా| కలువకంటి| ♦ నాతి| గోతి
పూఁబోఁడి| చిగురాకు ♦ బోఁడి| పైదలి| మించు
బోఁడి| ముద్దులగుమ్మ ♦ పొలఁతి| కొమ్మ|
ప్రోయా లువిద| తీఁగె ♦ బోఁడి| చేడియ| యించు
బోఁడి| యన్ను| వెలంది| ♦ బోటి |జోటి|
తే. చాన| తెఱవ |వెలందుక| ♦ చాన| లేమ|
చెలువ| మెలనాగ |చిలుకల ♦ కొలికి |కలికి|
తలిరుఁబోఁడి| యలరుఁబోఁడి| ♦ నెలఁత |పొల్తి
గరిత| యతివ| నా స్త్రీ సమా ♦ ఖ్యలు (మహేశ). 9

టీ. నెలఁతుక, క్రాల్గంటి=ప్రకాశించెడు కన్నులు గలది, పొలఁతుక, ముద్దియ, వాలుగంటి=వెడల్పుకన్నులుగలది, మగువ, పడఁతి, మడఁతి

---

(పూవు + మేనుగలది. బహువ్రీహి స్త్రీ వాచ్యంబగుచో నుప మానంబుమీఁది మేనునకు బోఁడియగు. బా. సమాస 23 సూ, ఇట్లె చిగురు బోఁడి మొదలైనవి.

చెలి, మచ్చెకంటి=చేఁపలవంటి కన్నులుగలది, ఉగ్మలి, ఇంతి, తొయ్యలి, నవలా, కలువకంటి = కలువలంబోలు కన్నులు గలది, నాతి, గోతి, పూబోఁడి=పూవువంటి శరీరముగలది, చిగురాకుబోఁడి = చిగురువంటి మేను గలది, పైదలి, మించు బోఁడి=మెఱుపువలె వెలిఁగెడి శరీరముగలది, ముద్దుల గుమ్మ = ముద్దులు మూటగట్టునది, పొలఁతి, కొమ్మ, ప్రోయాలు, ఉవిద, తీఁగబోఁడి=తీఁగవంటి (సన్నని) శరీరముగలది, చేడియ, ఇంచుఁబోఁడి= చెఱకువలెఁ బ్రియమైన శరీరము గలది, అన్న, వెలఁది, బోటి, జోటి, చాన తెఱవ, వెలందుక, చామ, లేమ, చెలువ, ఎలనాగ, చిలుకలకొలికి =చిలుక ముక్కులవంటి కన్నులకొనలుగలది, కలికి తలిరుఁబోఁడి=చిగురువలె(మెత్తని) దేహము గలది, అలరుఁబోఁడి = పూవువంటి (మెత్తని) దేహము గలది, నెలఁత, పొల్తి, గరిత, అతివ=ఈ ౪౭ యును స్త్రీకిఁ బేళ్ళు.

తే. చెలిమి|నేస్తంబు|పొందు|నా ♦ స్నేహమలరు
నెచ్చెలి|యనుంగు|సంగాతి|♦ నేస్తకాఁడు|
సంగడీఁ|డనఁ చెలికాఁడ|♦ నంగఁ దనరు
స్నేహితునకు సమాఖ్యలు ♦ (శ్రీమహేశ). 10

టీ. చెలిమి, నేస్తము, పొందు, ఈ ౩ ను స్నేహమునకుఁ బేర్లు. నెచ్చెలి, అనుంగు, సంగాతి, నేస్తకాఁడు, సంగడీఁడు. చెలికాఁడు (మతుప్రత్యయాంతములు.) ఈ ౬ ను స్నేహితునికిఁ బేరులు.

సీ. దొంగ|తెక్కలికాఁడు|♦ దొరకోలు సన్నాసి|
ముచ్చు|తొత్తుబరికాఁడు|ముడియవిడుపు|
తెరువాటుకాఁడు|క త్తెరదొంగ|చేవాఁడి
కాఁడు|వల్లడికాఁడు|♦ కన్నగాఁడు|
మునిముచ్చు|గడిదొంగ|♦ యనఁ దస్కరాఖ్యలౌఁ
జెండిపోతు|గరాసు|♦ మొండికట్టె|

టకటొంకు। టాటోటు। ♦ టక్కులాఁడు, పిసాళి
టక్కరి। ముడికాఁడు। ♦ ఠవళికాఁడు।
తే. కల్లరియు। గొంటు। కైలాట ♦ కాఁడు। చెడుగు।
బేరజము। కుచ్చితుఁడు। దోస ♦ కారి। చెనఁటి।
పాలసుఁడు। నాలిబూతంబు। ♦ పలువ। తులువ।
కూళ। గడుసన। వర్తిల్లుఁ ♦ (గుజను పేళ్ళు) 11

టీ. దొంగ, తెక్కలికాఁడు = బందిపోటు వేయువాఁడు, దొంగ కోలు సన్యాసి = వేషముదాల్చి నమ్మించి సొమ్మపహరించుకొనిపోవువాఁడు, ముచ్చు, ఎత్తుబరికాఁడు, ముడియవిడుపు = ముడివిచ్చి యెత్తుకొనిపోవువాఁడు, తెరువాటుకాఁడు = దారి నడ్డగించి కొట్టి తీసికొని పోవువాఁడు, కత్తెరదొంగ = కత్తిరించి దొంగిలించువాఁడు, చేఁవాడికాఁడు= చేతి బలముగలవాఁడు, వల్లడికాఁడు = కొల్లపెట్టుకొనిపోవువాఁడు, కన్నగాఁడు= కన్నము వేసెడివాఁడు, మునిముచ్చు = మునివలె మౌనముతో నేమి తెలియనట్లుండువాఁడు, గడిదొంగ=అంతర్యము నెఱింగనవాఁడు-ఈ ౧౩ ను దొంగలకుఁ బేరులు. చెండిపోతు = మూఢబుద్ధి గలవాఁడు, గరాసు, మొండికట్టె, టకటొంకు, టాటోటు, టక్కులాఁడు=కల్లలాడువాఁడు, పిసాళి, టక్కరి, (మతర్ధమందలి ప్రత్యయము) ముడికాఁడు, ఠవళికాఁడు= మోసము గలవాఁడు, కల్లరి = బొంకులాడువాఁడు, గొంటు, కైలాటకాఁడు = మాయోపాయముల నెఱిఁగినవాఁడు, (కైలాటము + కాఁడు-మువర్ణలోపము.) చెడుగు, బేరజము, కుచ్చితుఁడు, (కుత్సితశబ్దభవము.) దోసకారి=పాపములు చేయువాఁడు, (దోసము-ప్ర. దోషము) చెనఁటి; పాలసుడు, (ప్ర-బాలిశుఁడు) నాలిబూతము, పలువ, తులువ, కూళ, (ప్ర-కూరుఁడు) గడుసు. ఈ ౨౪ ను కుత్సితునికిఁ బేళ్ళు.

ఆ. పాపబుడుత చిఱుత ♦ పట్టి సిసువు కందు
కూన నిసువు బిడ్డ ♦ కుఱ్ఱ బొట్టె
యనఁగ శిశుసమాఖ్య ♦ లగు గొమరుండు, నాఁ
గొడుకు నాఁ గుమార ♦ కుండు వెలయు. 12

టీ. పాప, బుడుత, చిఱుత, పట్టి, సిసువు, (శిశుశబ్దభవము) కందు, కూన, నిసువు, బిడ్డ, కుఱ్ఱ, బొట్టె ఈ ౧౧ ను శిశువునకుఁ బేర్లు. కొమరుఁడు, (కుమారశబ్దభవము) కొడుకు-ఈ ౨ ను పుత్త్రుని పేళ్ళు.

ఆ. వటుసమాఖ్య లగును ♦ వసుధలోఁ గొండిక
వాఁడనంగఁ బడుచు ♦ వాఁడనంగఁ
బిన్నవాఁడనంగఁ ♦ జిన్నవాఁ డనగను
(వినుతగుణసనాథ ♦ విశ్వనాథ). 13

టీ. కొండికవాఁడు, పడుచువాఁడు, పిన్నవాఁడు, చిన్నవాఁడు-ఈ ౪ ను బాలునికిఁ బేళ్ళు.

సీ. గిటక పొట్టి కుఱుచ ♦ గిట్ట గుజ్జనఁగ వా
మనుఁ డొప్పుఁ జను నప ♦ స్మారిపేళ్ళు
వెడఁగు వేఁదుఱు వెఱ్ఱి ♦ పిఱిఁడి వెఱిఁడి
వెంగలి వెంబర ♦ విత్తనంగఁ
జతురునకును పేళ్ళు ♦ జాణ దంట వలంతి
వెరవరి ప్రోఢ నే ♦ ర్పరి యనంగ

ప్రన్నివాఁడు।రూ ♦ పరి చూడఁగలవాఁడు।
చక్కనివాఁడు। నా ♦ జగతిఁ బరఁగు

తే. సుందరాకారవంతుండు ♦ సొగసుకాఁడు
వన్నెకాఁడన శృంగారి ♦ వసుధ వెలయు
నంధకుని పేళ్ళు చీకు। గ్రు ♦ డ్డనఁగ మూఁగ।
మూవ।యన మూఁకనామముల్ ♦ (దేవదేవ). 14

టీ. గిటుక, పొట్టి, గుఱుచ, గిట్ట, గుజ్జు-ఈ ౫ ను పొట్టివాని పేళ్ళు. వెడఁగు, వేఁదురు, వెఱ్ఱి, వీఱిడి, వేఱిడి, వెంగలి, వెంబరవిత్తు-ఈ౭ను మూర్ఖునికిఁ బేళ్లు. జాణ, దంట, వలంతి, వెరవరి = ఉపాయము గలవాఁడు, ప్రోడ, (ప్రౌఢశబ్దవికృతి,) నేర్పరి, నేర్పుగలవాఁడు, ఈ ౬ ను సమర్థునికిఁ బేళ్లు, ప్రన్నివాఁడు, రూపరి, (రూప + అరి) = అందము గలవాఁడు, చూడఁగలవాడు = ఇతరులచేఁజూడఁదగినవాఁడు, చక్కనివాఁడు - ఈ ౪ ను సౌందర్యవంతునికిఁ బేళ్లు. సొగసుకాఁడు (సొగసు + కాఁడు) = వేడుకగల వాఁడు, వన్నెకాఁడు = వన్నెగలవాఁడు, ఈ ౩ ను సింగారించుకొన్న వానికిఁ బేళ్లు. చీకు, గ్రుడ్డి ఇవి ౨ ను అంధుని నామములు. మూఁగ, మూవ-ఈ౨ను మూఁగవాని పేళ్ళు.

క. కాయము పేళ్ళై వెలయును
మే।యన నొడ।లనఁగ మేను।♦ మెయి।యనభోగ్య
ప్రాయము ప్రేళ్ళగుఁ బరువము।
పాయము।జవ్వన మనంగ ♦ (భావజదమనా) 15

---

(వెరవు + అరి. వెరవరి, మత్వర్థమునందరియగు)
(నేర్పు + నేర్పరి, మత్వర్థీయకతద్ధితాంతము.)

టీ. మే, ఒడలు, మేను, మెయి, ఇవి ౪ ను శరీరమునకు నామములు, పరువము, ప్రాయము, జవ్వనము (యౌవనశబ్దభవము)-ఇవి ౩ ను యౌవనమునకు నామములు.

తే. నెఱులు| కురులు |వెండ్రుక లు| నా ♦ నెఱిక లనఁగ
కొప్పు|తుఱుము|మన వేనలి|♦ క్రొవ్వెద|యనఁ
గేశధమ్మిల్లములు మించుఁ ♦ గీలుగంటు|
క్రొమ్ముడి|యనంగఁ గేశబం ♦ధమ్మగు (భవ.) 16

టీ. నెఱులు, కురులు, వెండ్రుకలు, నెఱికలు-ఈ ౪ ను కేశముల నామములు. కొప్పు, తుఱుము, వేనలి, క్రొవ్వెద-ఈ ౪ ను స్త్రీల కొప్పునకుఁ బేళ్లు. కీలుగంటు, క్రొమ్ముడి-ఈ ౨ ను వెండ్రుకలముడికిఁ బేళ్ళు.

తే. నొసలు|నెన్నొసల్|నుదురు| నె ♦ న్నుదురు|రనంగఁ
దనరు ఫాలంబు చూడ్కి| చూ ♦ పనఁగ నొప్పు
నాహ్వయము లీక్షణమునకు ♦ నక్షికాఖ్య
లలరుఁగన్|గను|కన్ను| నా ♦ (నభ కేశ). 17

టీ. నొసలు, నెన్నొసలు, నుదురు, నెన్నుదురు-ఇవి ౪ ను ఫాలభాగమునకుఁ బేళ్లు. చూడికి పా. చూడ్కి, చూపు - ఇవి ౨ ను చూచుటకుఁ బేళ్లు. కన్, కను, కన్ను-ఇవి ౩ ను నేత్రములకుఁ బేళ్ళు.

క. వీను|లనఁ జెవు|లనంగా
జానుగు|లన నాహ్వయములు ♦ శ్రవణంబులకున్

---

క్రొవ్వెద=క్రొత్త + వెద, ఆద్యక్షర శేషంబగు క్రొత్తశబ్దమునకుఁ బరమగు పరుషసరళస్థిరములకు ద్విత్వము గలుగును.

చూడ్కి (చూచుధాతువుకృదంతము).

గా|నన నడు|మనఁగా నభి
ధానము లగు మధ్యమునకుఁ ♦ (దరుణేందుధరా). 18

వీను, చెవి, జానుగు - ఇవి 3 ను చెవులకు నామములు. కౌను, నడుము-ఇవి 2 ను నడుమునకుఁ బేళ్ళు.

తే. అక్కు|ఱొమ్మెద బోర|నా ♦ నలరు వక్ష
మాస్యమున కొప్పుచుండు నా ♦ ఖ్యలు మొగంబు
మోర|మో మనఁ బేళ్లొప్పు ♦ నూరువునకుఁ
బెందొడ|యనంగఁ గుఱుపు|నా ♦ (నందివాహా). 19

టీ. అక్కు, ఱొమ్ము, ఎద [ప్రి]హృదయము, బోర-ఈ 4 ను వక్షస్థలమునకుఁ బేళ్ళు. మొగంబు, [ముఖశబ్దభవము] మోర, మోము[ప్ర] ముఖము-ఈ 3 ను ముఖమునకుఁ బేరులు. పెందొడ, కుఱువు ఈ 2 ను ఊరువునకు నామములు.

తే. వదనగుహ|యొప్పునోరు|నా ♦ వాయి|యనఁగఁ
బలు|పలు|నాఁగ దంతంబు ♦ పేళ్ళు వెలయు
బెదవి|వాతెఱ|మోవి|య ♦ న్పేళ్ళఁ దనరు
చుండునోష్ఠంబు (శీతాంశు ♦ ఖండమౌళి). 20

టీ. నోరు, వాయి-ఈ 2 ను నోటి రంధ్రమునకుఁ బేరులు. పల్లు, పలు-ఈ 2 ను దంతనామములు, పెదవి, వాతెఱ, మోవి - ఈ 3 ను ఓష్ఠమునకు నామములు.

క. కయి యనఁగై|నాఁ గేలనఁ
జెయి యనఁజై|నాఁగఁ జెయ్యి|♦ చే|నా హస్త

హ్వాయము లగు (నన్నపూర్ణా
ప్రియవల్లభ కాశీకాపు రీవరనిలయా). 21

టీ. కయి; కై, కేలు, (కేలు-నిత్యైకవచనాంతము.) చెయి, చై, చెయ్యి, చే ఈ 8 ను హస్తములకు పేళ్ళు.

క. ఎద|యన డెందం|బనఁగా
మది|యనఁగా నెడఁ|దనంగ ♦ మఱి యుల్లము|నా
హృదయమునకు నివి యెసఁగును
విదితంబుగ నాహ్వాయములు ♦ (విశ్వాధిపతీ). 22

టీ. ఎద, డెందము, మది, (మతిశబ్దభవము) ఎడఁద-పా, ఎడ, (హృదయశబ్దభవము). ఉల్లము - ఇవి ౫ ను మనస్సునకుఁ బేర్లు.

క. లోఁజెయ్యి|న నఱచెయ్యి|నఁ
గాఁ జెల్లును బేళ్లు రెండు ♦ కరతలమునకుఁ
మీఁజెయ్యనఁ బెడచెయ్యన
నాఁ జనుఁ గరచరమ భాగ ♦ నామములు (శివా) 23

టీ. లోఁజెయ్యి = చేతియొక్క లోపలిభాగము, అఱచెయ్యి = లోపలిచెయ్యి ఇవి ౨ ను అఱచేతికిఁబేరులు. మీఁజెయ్యి = చేతియొక్క మీఁదిభాగము, (మీఁదు + చెయ్యి = మీఁజెయ్యి) పెడచెయ్యి = చేతికి వెనుకటిభాగము. ఇవి ౨ ను హస్తముయొక్క వెనుకటి భాగమునకుఁ బేరులు.

ఆ. పొట్ట|డొక్క|కడుపు|♦ బొజ్జ|బొఱ్ఱ|యనంగ
నొప్పుచుండు నాఖ్య ♦ లుదరమునకు

22 ఎడ్డయని కూడ భారతమున, ప్రయోగము కలదు.

నాభి బిలమునకును ♦ నామధేయములగు
బొడ్డు|నాఁగ మఱియు, ♦ బొక్కిలనఁగ. 24

టీ. పొట్ట, డొక్క, కడుపు, బొజ్జ, బొజ్జ- ఈ ౫ ను ఉదరమునకుఁ బేళ్ళు. బొడ్డు, పొక్కిలి-ఈ ౨ ను నాభికిఁ బేళ్ళు.

తే. వెన్ను|నంగను వీఁపు|నా ♦ వెనుకమేను|
నాఁగఁ జరమాంగమున కొప్పు నామములుగఁ
బుఱ్ఱె|తలపాల|నాఁ బుఱ్ఱ ♦ పుఱియ|నాఁగ
ఫాలమున కాఖ్యలై యొప్పు ♦ (ఫాలనేత్ర.) 25

వెన్ను| వీపు,| వెనుకమేను | = శరీరముయొక్క వెనుకటిభాగము- ఇవి 3 ను వీఁపునకుఁ బేరులు. పుఱ్ఱె, తలపాల, పుఱ్ఱ, పుఱియ- ఈ ౪ ను కపాలమునకుఁ బేళ్ళు.

క. అడు|గంజ|హజ్జ|యనఁగాఁ
బుడమిఁ బదంబునకు నామ ♦ ములు విలసిల్లున్,
మెడ|పుత్తు|కట్టు|గొంతుక
నడరు గళంబునకుఁ (బేళ్ళ ♦ నంగధ్వంసీ.) 26

టీ. అడుగు. అంజ హజ్జ-ఈ ౩ ను పాదములకుఁ బేళ్ళు. మెడ, పుత్తుక, అట్టు, గొంతు - ఈ ౪ ను గొంతునకుఁ బేర్లు.

ఆ. బువ్వ|వంటకంబు|♦ బోనంబు| మెతుకు/ కూడు/
డోగిరము|పసాద|♦ మోరె|మనఁగ
నన్న మొప్పుఁ జేల ♦ మలరుఁ బుట్టంబు/దు
దువ్వలువ|చీర|కోక|♦ వలువ|యనఁగ. 27

టీ. బువ్వ, వంటకము, బోనము, మెతుకు; కూడు, ఓగిరము, పసాదము, ఓరెము-ఈ ౮ యను అన్నమునకు నామములు. పుట్టము, దువ్వాలువ, చీర-పా. చీర, కోక, వలువ-ఈ ౬ ను వస్త్రమునకు నామములు.

తే. మెసవె|నారోగిణ మొనర్చె|♦ మెక్కె|దినియెఁ|
గుడిచె నారగించెను|బసా ♦ పడియె |నమలె |
సాపడె| ననంగ నొప్పు భో ♦ జనము సేసె
ననుట కివి యాఖ్యలై (యీశ ♦ యభ్రకేశ). 28

టీ. మెసవెను-పా మెసఁగెను. ఆరోగిణమొనర్చెను. పా-ఆరోగణ మొనర్చెను. మెక్కెను, తినియెను, కుడిచెను, ఆరగించెను, బసాపడియెను, నమలెను, సాపడెను-ఈ ౯ యను భోజనముచేసె ననుటకుఁ బేరులు.

క. నానయన సిగ్గు|సిబ్బితి|
నా నివి వ్రీడాపదంబు ♦ నామంబు లగుం
బానముసేయుట పేళ్ళగు
నానుట|ద్రావుట|నఁ దాగు ♦ ట|నఁ గ్రోలుటనన్. 29

టీ. నాన, సిగ్గు, సిబ్బితి-ఈ 3 ను లజ్జకు బేరులు. ఆనుట, త్రాగుట, త్రావుట, క్రోలుట-ఈ ౪ ను పానము సేయుటకుఁ బేరులు.

ఆ. తళియ |పళ్ళెరంబు|♦ తెలె |హరివాణంబు|
తట్ట కంచ|మనఁగఁ ♦ దనరుఁ బాత్ర
చెల్లుజషకమునకుఁ ♦ బేళ్ళు డబ్బురకోర
గిన్నె యనఁగ (రజత ♦ గిరినివాస) 30

టీ. తళియ, పళ్ళెరము, తెలె, హరివాణము, తట్ట, కంచము-ఈ౬ను

భోజనపాత్రమునకుఁ బేరులు. దబ్బర, కోర, గిన్నె-ఇవి ౩ ను పానపాత్రమునకుఁ బేరులు.

తే. నతికిఁ బేళ్లొప్పు జోత। దం ♦ డము। జోహారు।
మ్రొక్కు। జేజే। యనంగఁ గేల్ ♦ మొగిచెఁ। గొలిచె।
నెఱఁగెఁ। జేమోడ్చె। నన నమ ♦ స్కృతియొనర్చె
ననుట కివి యాఖ్యలగు (నిశ ♦ యభ్రకేశ). ౩౧

టీ. జోత, దండము, జోహారు, మ్రొక్కు, జేజే ఇవి ౫ ను నమస్కారమునకుఁ బేరులు. కేల్మొగిచెఁ = చేతులు జోడించెను, కొలిచెను, ఎఱఁగెఁ = పా. ఎరఁగెఁ, చేమోడ్చెను = చేతులఁ జోడించెను. ఈ ౪ ను నమస్కారము చేసెననుటకుఁ బేరులు.

తే. ఒప్పు శయనించుటకును బ ♦ న్నుండెఁ బండెఁ
బవ్వడించెఁ। బరుండెను। ♦ బవ్వళించె।
నత్తమిల్లె। ననన్నెఱి। ♦ మెత్త। సెజ్జ
పఱుపు। పాన్పునఁ దగు శయ్య ♦ (ఫాలనేత్ర). ౩౨

టీ. పన్నుండెను, పండెన్, పవ్వడించెను, పరుండెను, పవ్వళించెను, అత్తమిల్లెను-ఈ ౬ ను శయనించెననుటకుఁ బేళ్లు. మెత్త, సెజ్జ, ప్ర. శయ్యా. పఱుపు, పాన్పు ఈ ౪ ను శయ్యకుఁ బేళ్లు.

తే. ఒప్పు ధ్వనిపేళ్ళు రొద। యన ♦ నులివు। నాఁగ
సద్దనంగను గూఁత। నాఁ ♦ జప్పు। డనఁగ
నలుకు। డనరోదనము। సేసె ♦ ననుట కాఖ్య
లెసఁగు నఱచెను। వాపోయె। ♦ నేడ్చె। ననఁగ ౩౩

టీ. రొద, ఉలివు, సద్దు, (ప్రకృతిశబ్దము) రవళి, చప్పుడు, అలుకుడు — ఈ ౬ ను శబ్దమునకు పేరులు. అతిక్రమించినాపొరయెను ఏడ్చెను — ఈ 3 ను రోదనము చేసె ననుటకుఁ బేరులు.



క. అగుఁ బేళ్లు నీరువట్టన
దగ | దప్పి | యు దూప | యనఁగ ♦ దాహంబునకున్
నగవు | నగు | నవ్వు | నా
నగు నాఖ్యలు హాసమునకు ♦ (నగజాధీశా) 34

టీ. నీరుపట్టు, దగ, దప్పి, దూప — ఈ ౪ ను దాహమునకుఁ బేరులు. నగవు, నగు, నవ్వు, నవు, ఈ ౪ ను నవ్వునకుఁ బేరులు.

క. చాగము | నాఁ బుడుకనఁగా
నీగి | యనఁగ నిడుట | యనఁగ ♦ నివి | యనంగా
దేగము | నాఁ బెట్టుడు | నాఁ
ద్యాగమునకు నాఖ్య లగుచు ♦ ధరఁబరగు (శివా.) 35

టీ. చాగము, పడుపు, ఈగి, ఇడుట, ఈవి, తేగము, (త్యాగశబ్దభవము) పెట్టుడు — ఈ 8 ను దానమునకుఁ బేరులు.

ఆ. ఎలసె | బెరసె | హత్తె | ♦ నెనసె | నదికెఁ | జెంచె |
బొంచె | దారసెఁ | గూడెఁ | ♦ నొందె | జనకె |
ననఁగ | సక్తమయ్యె | ♦ ననుటకు నివి యాఖ్య
లగు (గిరీశ యీశ ♦ యభ్రకేశ). ౩౬

ఈగి - ఇచ్చుధాతువు కృదంతము.

ఇడుట - ఇచ్చుధాతువు భావార్థకము.

టీ. ఎలసెజ్జ, బెరసెజ్జ, హత్తెజ్జ, ఎనసెజ్జ, అదికెజ్జ, చెందెజ్జ, పొందెజ్జ, దొరసెజ్జ, కూడెజ్జ, ఒందెజ్జ, చెనకెజ్జ-ఇవి ౧౧ కలిసికొనె ననుటకుఁ బేర్లు.

ఆ. ఎడసెఁ|బాసె|వేఱు ♦ పడెఁ|బురివిచ్చె|నా
నలరు భేద మయ్యె ♦ ననుట పేళ్ళు
స్వవశమయ్యె ననుట ♦ కవ్వుఁ బేళ్లు లోనయ్యె|
నగ్గమయ్యె|ననఁగ ♦ (ననమనేత్ర). 37

టీ. ఎడసెజ్జ, పాసెజ్జ, వేఱుపడెజ్జ, పురివిచ్చెజ్జ-ఈ ౪ ను ఎడ బాసె ననుటకుఁ బేరులు. లోనయ్యెజ్జ, అగ్గమయ్యెజ్జ ఈ ౨ ను స్వాధీన పడె ననుటకుఁ బేళ్ళు.

ఆ. అగు గృహీత మయ్యె ♦ ననుటకుఁ బేళ్ళగ
పడియెఁ|జేపడియెను|♦ బట్టువడియెఁ|
జిక్కువడియెఁ|దగిలెఁ|♦ జిక్కెఁ|దగుల్పడె|
ననఁగ (నగనివేశ ♦ యభ్రకేశ). ౩౮

టీ. అగపడియెజ్జ (అగ్గము + పడియెను.) = ఆధీనమయ్యెను. చేపడియెను (చే+పడియెను.) = చేతఁజిక్కెను, పట్టు వడియెను = పట్టు చిక్కెను, చిక్కువడియెను. తగిలెను=తవిలెను, చిక్కెను, తగుల్ప డెను. ఈ ౮ యును గృహీతమయ్యె ననుటకు బేరులు.

తే. అనియె|నొడివె|వక్కాణించె|♦ నాడెఁ|జెప్పె|
వినిచె|వాక్రుచ్చెఁ|బలికెఁ|నాఁ ♦ జను వచించె
ననుట కాలించె|నాలకిం ♦ చెను|వినె|నన
నలరు నవధరించె నటంట ♦ కాఖ్య (లీశ). 39

నాఖ్యలగుఁ గార్యవైకల్య ♦ మయ్యె ననుట
(కంధకాసురహరణ శా ♦ ప్యాద్రిశరణ). 9

టీ. ఆఱుమూఁడయ్యె, కచ్చువిచ్చయ్యె, బెడిసె, బుసిపోయె చెడి యె ఈ ౫ ను కార్యముచెడె ననుటకుఁ బేర్లు.

క. అలజడి సెంజిలి పిమ్మట
సిలు గుత్తలపాటు వంత ♦ సేగి నెగుల్ గొం
దల మలమ టడరు గోడు
మ్మలిక వనటఁ గుందునా న ♦ మరు దుఃఖాఖ్యల్. 10

టీ. అలజడి, సెంజిలి, పిమ్మట, సిలుగు, ఉత్తలపాటు (ఉత్తలము + పాటు) వంత, సేగి, నెగులు, కొందలము, అలమట, అడరు, గోడు, ఉమ్మలిక - రూ. ఉమ్మలికము, వనట, కుందు - ఈ ౧౫ ను దుఃఖము నకు పేర్లు.

క. అరిది వెఱం గచ్చెరు వ
బ్బుర మబ్రం బనఁగ జిత్ర ♦ మునకుం బేర్లౌ
సరణికిఁ బేళ్ళగుఁ ద్రోవనఁ
దెరు వన దారి యన బాట ♦ తెన్నన (నభవా). 11

టీ. అరిది, వెఱగు, అచ్చెరువు, అబ్బురము, అబ్రము - ఈ ౫ ను చిత్రమునకుఁ బేర్లు. త్రోవ, తెరువు, దారి, బాట, తెన్ను - ఈ ౫ ను మార్గమునకుఁ బేర్లు.

తే. ఐదుపదిచేసె వెనుకముం ♦ దయ్యె జుణిఁగె
వీఁగె వెన్నిచ్చె వెనుకంజ ♦ వేసె ననఁగ
నోహటించె ననంగఁ బే ♦ ళ్ళొప్పుచుండు
నాహవపరాఙ్ముఖుం డయ్యె ♦ ననుట (కభవ). 12

టీ. అయిదుపదిచేసె (ముందునకొకయడుగుపెట్టియుద్ధముసేయనున్న వాఁడు జడిసి కాలు వెనుకఁబెట్టుట) వెనుకముందయ్యె, జుణిఁగె, వీఁగె, వెన్నిచ్చె = వీపుచూపెను, వెనుకంజవేసె (వెనుక + అంజ + వేసెను)= వెనుకడుగుపెట్టెను, ఓహటించె - ఈ ౭ ను యుద్ధమందు పరాఙ్ముఖుఁడయ్యెననుటకుఁ బేర్లు.

తే. మోహరించెను దండెత్తి ♦ మొనసె దాడి
చేసెఁ బోటొగ్గెఁ గోల్తల ♦ చేసె మాఱు
కొనియె దళమెత్తె ననఁగఁ బే ♦ ర్లొనరుచుండు
నాహవోద్యోగ మొనరించె ♦ ననుట (కభవ) 13

టీ. మోహరించె, దండెత్తె, మొనసె. దాడిచేసె, పోటొగ్గె, కోల్తల చేసె, మాఱుకొనియె, దళమెత్తె-ఈ ౮ యు యుద్ధప్రయత్నముచేసెననుటకుఁ బేర్లు.

ఆ. ఆహవోన్ముఖతకు నోల ♦ మాసగొనక
పిఱుతివియ కీడఁబోకనఁ ♦ బేళ్ళు దనరు
నబ్బెసమొనర్చెఁ గఱచె నా ♦ నభ్యసించె
ననుట కభిధానములు (చంద్ర ♦ మావతంస). 14

టీ. ఓలమాసగొనక, పిఱుతివియక, ఈడఁబోక-అనునీ ౩ ను వెనుకదీయక అనుటకుఁబేర్లు. అబ్బెసమొనర్చె (అబ్బెసము-ప్రకృతి అభ్యాసము.) కఱచె-ఈ ౨ ను అభ్యసించెననుటకు నామములు.

క. వేఱొక టనఁ బై పెచ్చన
మాఱటయిమ్మడి యనన్ స ♦ మాహ్వాయములు పెం
పాఱును వస్త్వంతరమున
(కొఱగ కేయూరసహిత ♦ హాత మారజితా). 15

టీ. వేఱొకటి, పైపెచ్చు, మాఁటి, ఇమ్మడి-ఈ ౪ ను మఱియొకటియనుటకుఁ బేర్లు.

సీ. ఆఱడిపోయెను ♦ బీఱువోయెను రిత్త
వోయెను వీసర ♦ వోయె ననఁగ
నుడివోయెఁ బొలివోయె ♦ సుడివోయె ననఁగను
వ్యర్థమయ్యె నటంట ♦ కాఖ్య లయ్యె
గడిమిబీరంబు మ ♦ గంటిమి గండన
విక్రమాహ్వయములై ♦ వెలయుచుండు
నాస్ఫాలన మొనర్చె ♦ ననుటకుఁ జఱచె నా
నప్పళించె ననఁగ ♦ నాఖ్య లయ్యె

తే. నొగి వరుస యోలి సొరిది నా ♦ నోజనాఁగఁ
గ్రమమునకు నాఖ్యలయ్యెను ♦ (గాలకంఠ)
కొఱ కొఱంత తక్కువ వెలితి ♦ కొదవ కడమ
యనఁగ నూనంబునకు నాఖ్య ♦ లై తనర్చు. 16

టీ. ఆఱడిపోయె, బీఱువోయె, రిత్తవోయె, వీసరబోయె, ఉడివోయె, పొలివోయె, సుడివోయె- ౭ ను వ్యర్థమయ్యె ననుటకుఁ బేళ్లు. కడిమి, బీరము, మగఁటిమి, గండు-ఈ ౪ ను విక్రమమునకుఁ బేళ్లు. చఱచె, అప్పళించె ఈ ౨ ను అఱచేతితోఁ గొట్టెననుటకుఁ బేళ్లు. ఒగి, వరుస, ఓలి (పఙ్క్తి ఆళి,) సొరిది, ఓజ - ఈ౫ను క్రమమునకుఁ బేళ్లు. కొఱ, కొఱంత, తక్కువ, వెలితి, కొదవ, కడమ-ఈ ౬ ను ఊనమునకుఁ బేళ్లు.

తే. నెట్టుకొనెఁ బొలుపడె నొడి ♦ గట్టె ననఁగ
గడఁగెఁ దొడఁగెను జెలరేఁగెఁ ♦ గాలుద్రొక్కెఁ

గవిసెఁ గదిసె ననంగ నాఖ్యలయి యొప్పు
నభిముఖుం డయ్యె ననుటకుఁ ♦ (నగనివేశ). 17

టీ. నెట్టుకొనె, పొలుపడె, ఒడిగట్టె, కదఁగె, తొడఁగె, చెలరేఁగె, కాలుద్రొక్కె, కవిసె, కదిసె - ఈ ౯ యును అభిముఖుం డయ్యె ననుటకు పేర్లు.

తే. అగపడకపోయె విచ్చు ♦ మొగ్గయ్యె ననఁగఁ
గంటఁ బడదయ్యెఁ బంచ బం ♦ గాళమయ్యె
ననఁగ దృగగోచరం బయ్యె ♦ ననుట పేళ్ళు
(శయఘుటిలశూల వైయాఘ్ర ♦ (చర్మచేల.) 18

టీ. అగపడకపోయె, విచ్చు మొగ్గయ్యె, కంటఁబడదయ్యె, పంచ బంగాళమయ్యె - ఈ ౪ ను కనఁబడ లేదనుటకుఁ బేర్లు.

క. వెలిచవి చీఁకటితప్పనఁ
బొలుపారఁగ జారభావ ♦ మునకుం బేళ్ళౌఁ
బులు కసటు చిలు మనంగను
మలిన మనుట కాఖ్యలయ్యె ♦ (మనసిజదమనా). 19

టీ. వెలిచవి, చీఁకటితప్పు - ఈ ౨ ను జారభావమునకుఁ బేళ్లు. పులు, కసటు, చిలుము ఈ 3 ను మలినమనుటకుఁ బేర్లు.

ఆ. వింగడం బనంగ ♦ విపరీత మగు నుక్కి-
వం బనఁగను గుత్సి ♦ తంబు పరఁగు
నాఖ్య యగుచుఁ దనరు ♦ నామని యనఁగను
మదమునకును (జంద్ర ♦ మఃకలాప). 20

టీ. వింగడము - ఈ ౧ యు విపరీతమునకు బేరు. ఉక్కివము-ఈ యు కుత్సితమునకుఁ బేరు. ఆము-ఈ ౧ యు ఆముదమునకు బేరు.

క. ఎల యండ్రు తరుణ మనుటకు
గొలయన దురితంబు పేరు ♦ కుడియెడమలనన్
వలపలదాపల లనఁగను
బొలుపుగ నపసవ్యసవ్య ♦ ములకుం బేర్లు. 21

టీ. ఎల-ఈ ౧ యు తరుణమునకుఁ బేరు. కొల-ఈ ౧ యు పాపమునకుఁ బేరు. కుడియెడమలు, వలపలదాపలలు - ఈ ౨ ను దక్షిణవామభాగములకుఁ బేర్లు.

క. తగు నౌద్ధత్యము పేళ్ళై
పొగ రన నా మనఁగ ద్రుళ్ళు ♦ పోతరమనఁగా
నెగడును భయంబు పేళ్ళై
నెగడు దిగులు వెఱపు జంకు ♦ బీ తలు కనఁగన్. 22

టీ. పొగరు, ఆము, త్రుళ్ళు, పోతరము - ఈ ౪ ను గర్వమునకుఁ బేరులు. బెగడు, దిగులు, వెఱపు, జంకు, బీతు, అలుకు - ఈ ౬ ను భయమునకుఁ బేరులు.

క. అరి యనఁగప్పం బనఁగాఁ
గరమునకుం బేళ్ళు కాఁగు ♦ కడవ పనఁటినాఁ
బరగు ఘటాఖ్యలు (నమితా
మరవానికాయ భూతి ♦ మండితకాయా). 23

టీ. అరి, కప్పము-ఈ ౨ ను (రాజులకుఁ జెల్లించు) పన్నుకుఁ బేర్లు కాఁగు, కడవ, పనఁటి, రూ. పంటి-ఈ 3 ను ఘటమునకుఁ బేళ్ళు.

తే. అంగరుచుండును గొండ్లిరం ♦ తనంగఁ గేళి
హాని కాఖ్యలు చేటు కీ ♦ డఱ యనంగ
హెచ్చరిక హోళి సంతసం ♦ బెలమి వేడ్క
యనఁగ నానందమున కాఖ్య ♦ లై తనర్చు. 24

టీ. గొండ్లి, రంతు-ఈ ౨ ను కేళికిఁ బేళ్ళు. చేటు, కీడు, అఱ-ఈ ౩ ను హానికిఁ బేరులు. హెచ్చరిక, హోళి, సంతసము, (ప్రకృ. సంతోషము.) ఎలమి, వేడ్క, రూ. వేడుక-ఈ౫ ను ఆనందమునకుఁ బేళ్ళు.

క. సాహిణ మనఁ బాగా యన
వాహాగారంబునకును ♦ వర్తిలుఁ బేళ్ళై
వ్యూహమున కాఖ్యలయ్యెను
మోహర మన నొడ్డనంగ ♦ మొగ్గర మనఁగన్. 25

టీ. సాహిణము. పాగా-ఈ ౨ ను హాయమునకుఁ బేరులు. మోహరము, ఒడ్డు, మొగ్గరము-ఈ ౩ ను వ్యూహమునకుఁ బేరులు.

క. ఒనరించె ననఁగఁ గావిం
చెననంగను సలిపె ననఁగఁ ♦ జేసె ననంగాఁ
జనునాచరించె ననుటకుఁ
(గనకాచలచాప చంద్ర ♦ ఖండకలాపా.) 26

టీ. ఒనరించె, కావించె, సలిపె, చేసె-ఈ ౪ ను ఆచరించెననుటకు నామములు.

తే. చీకఁటా లిరు లనఁగను ♦ జీఁకటియనఁ
దిమిరమునకు నభిఖ్యలై ♦ తేజరిల్లు

నాఖ్యలై తనరాఁగ ను ♦ పాయమునకు
సుళు వనఁగ వెర వనఁగను ♦ సూటి యనఁగ. 27

టీ. చీఁకువాలు, ఇరులు (ఏకవచన) చీఁకటి-ఈ 3 ను అంధకారమునకుఁ బేరులు. సుళువు, వెరవుసూటి-ఈ 3 ను ఉపాయమునకుఁ బేరులు.

తే. చేరువయ్యెను డాసెను ♦ దారసిల్లె
ననఁగ సన్నిహితంబౌట ♦ కాఖ్యలయ్యె
స్థూల మనుటకుఁ బేళ్ళగుఁ ♦ దోర మనఁగఁ
గడిఁది వలుఁద యనంగను ♦ (గాలకంఠ) 28

టీ. చేరువయ్యె, డాసె-రూ. దాసె. తారసిల్లె-ఈ 3 ను సమీపించె ననుటకుఁ బేరులు. తోరము, కడిఁది, వలుఁద-ఈ3ను స్థూలమనుటకుఁ బేళ్ళు.

తే. వాడెఁ గసుగందె ననఁ బుయి ♦ లోడె ననఁగ
విన్నవోయె ననంగను ♦ జిన్నవోయె
ననఁగ బేళ్ళగు నివి ఖిన్నుఁ ♦ డయ్యె ననుట
(కంధకాసురహరణ రౌ ♦ ప్యాద్రిశరణ). 29

టీ. వాడె, కసుగందె, పుయిలోడె, విన్నపోయె, చిన్నవోయె-ఈ ౫ ను ఖిన్నుండయ్యెననుటకుఁ బేరులు.

క. గరువము మురిపం బనఁగను
బరఁగున్ గర్వంబుపేళ్ళు ♦ భటనామము లొం
టరి లెంక బం టనంగను
(బురదానవహరణ శేష ♦ భుజగాభరణా). 30

టీ. గరువము, మురిపము-ఈ ౨ ను గర్వమునకు నామములు. ఒంటరి, లెంక, బంటు, (భటశబ్దభవము)-ఈ 3 ను భటుని పేర్లు,

క. అరదంబు తే రనంగను
బరఁగు రథంబునకుఁ బేళ్ళు ♦ పరి యన్ననుగా
లరు లనఁ బదాతి సంహతి
(పురదానవహారణ శేష ♦ భుజగాభరణా). 31

టీ. అరదము, రథశబ్దభవము) తేరు-ఈ ౨ ను రథమునకు నామము
లు. పరి, కాలరులు- ఈ ౨ ను కాల్బలమునకు నామములు.

క. సందియ మన ననుమాన మ
నం దనరును సంశయంబు ♦ నకు బేళ్ళై గో
బృందాహ్వయంబు లలరును
మం దనఁ గోన యనఁ (జంద్ర ♦ మఃఖండధరా). 32

టీ. సందియము, (సందేహశబ్దభవము). అనుమానము - ఈ ౨ ను
సంశయమునకుఁ బేళ్ళు. మంద, కోన -ఈ౨ను గోసమూహమునకుఁ బేర్లు.

క. మొన వాఁగు దండు దళ మనఁ
దనరున్ సైన్యంబుపేళ్ళు ♦ దళవాయి యనన్
మొనకాఁ డనంగఁబడవా
లనఁగన్ సేనాధపతికి ♦ నాఖ్యలు పొలుచున్. 33

టీ. మొన, వాగు, దండు, దళము - ఇవి ౪ ను సైన్యమునకుఁ బేర్లు.
దళవాయి, మొనకాఁడు, పడవాలు-ఇవి ౩ ను సేనాధిపతికిఁ బేర్లు.

క. మైకొనియె నియ్యకొనె నొడం ♦ బడియె నొప్పె
ననఁగ నంగీకరించుట ♦ కాఖ్య లయ్యె
సంఘటించుట కాఖ్యలై ♦ జానుమీఱుఁ
జెటివెఁ దురిమెను గీల్కొల్పెఁ ♦ జెక్కె ననఁగ. 34

టీ. మైకొనియె, ఇయ్యకొనె, ఒడంబడె, ఒప్పె ఇవి ४ ను అంగీకరించెననుటకుఁ బేరులు. చెరివె, తుటిమె కీల్కొల్పె, చెక్కె ఇవి ४ ను సంఘటించెననుటకుఁ బేరులు.

తే. దిట్టపడియె ముక్కోఁకలు ♦ దీరె ననఁగ
నాటితేఱె ననం గడి ♦ దేఱె ననఁగఁ
గసిమసంగె ననంగ నా ♦ ఖ్యలు దనర్చు
నిపుణుఁ డయ్యె నటంటకుఁ ♦ (ద్రిపుర వైరి).

టీ. దిట్టపడియె, ముక్కోఁకలుదీరె, ఆటితేఱె, గడిదేఱె, కసిమసంగె-ఇవి ౫ ను నిపుణుఁడయ్యె ననుటకుఁ బేరులు.

క. తడవు వడి కా రనంగా
నడరుం గాలంబు శిథిల ♦ మయ్యె ననుట యా
విడెవీడె నూడె విచ్చెను
సడలె నురలె వదలెఁ బ్రిదిలె ♦ జాఱె ననంగన్. 36

టీ తడవు, వడి, కారు ఇవి ३ ను కాలమునకుఁ బేరులు. విడె, వీడె, ఊడె, విచ్చె, సడలె, ఉరలె, వదలె, ప్రిదిలె, జాఱె ఇవి ౯ యు శిథిలమయ్యె ననుటకుఁ బేరులు.

క. మది డెంద ముల్ల మెద యన
హృదయంబున కాఖ్య లయ్యె ♦ నీఱం బనఁగాఁ
బొదరిల్లనఁగ నికుంజము
(సదయాంతఃకరణ ♦ తరుణచంద్రాభరణా) 37

టీ మది, (ప్ర. మతి) డెందము, ఉల్లము, ఎద -ఈ ४ ను హృదయమునకుఁ బేరులు ఈఱము, పొదరిల్లు (పొద + ఇల్లు రేఫాదేశము)-ఈ ౨ ను నికుంజము పేరులు.

క. తెగ దినుసు తోయ మనఁగను
నెగడుఁ బ్రకారంబునకును ♦ నెఱి నామములై
మెగ మనఁగ మెక మనంగను
మృగమునకునభిఖ్య ♦ (మేరుశరాసా.) 38

టీ. తెగ, దినుసు, తోయము-ఇవి 3 ను ప్రకారమునకు నామములు మెగము, మెకము. (ఇవి రెండును మృగశబ్దభవములు) ఇవి౫ ను మృగమునకుఁ బేరులు

క. ఎడ దవ్వు కెళ వనంగా
నడరున్ దూరంబునకు స ♦ మాఖ్యలు నలి నాఁ
బొడి నుగ్గు తుమురు నురు మన
బెడఁగడరుం జూర్ణమునకుఁ ♦ బేళ్లై(శర్వా). 39

టీ. ఎడ, దవ్వు, (ప్రకృతి-దవియస్సు), కెళవు-ఇవి3 ను దూరమునకుఁ బేరులు. నలి, పొడి, తుమురు, నురుము. ఇవి ౪ ను చూర్ణమునకుఁ బేర్లు.

క. ప్రేరేచెను బురికొలిపెను
దారిచె ననఁ జోదనకును ♦ దగు నాఖ్యలు పెం
పారును జాంబూద్వీపము
నేరెడుదీవి తొలుదీ వ ♦ నెడు నామములన్. 40

టీ. ప్రేరేచెను, పురికొలిపెను, తారిచెను - ఇవి 3 ను ప్రేరణచేసె ననుటకుఁ బేరులు. నేరెడుదీవి=నేరెడుచెట్టుగల ద్వీపము. తొలుదీవి (దీవి దీప శబ్దభవము) = మొదటిద్వీపము - ఇవి ౨ ను జంబూద్వీపమునకు పేరులు.

క. తొలఁగెం బాసె ననంగా
నలరున్ విముక్తతకుఁ బ్రాప్త ♦ మయ్యె ననుటపే

ళ్ళమె నొదవె దక్కొనియెను
నెలకొనియెన్ జెందెననఁగ ♦ నెక్కొనియె ననన్. 41

టీ. తోలఁగెను, *పాసెను - ఇవి ౨ ను దూరముగాఁ బోవుటకు పేరులు. అలమె, ఒదవె, దక్కొనియె, నెలకొనియె, చెందె, నెక్కొనియె- ఇవి ౬ ను లభించెననుటకుఁ బేరులు.

క. వెనుకఁ దరువాతఁ బిమ్మట
ననఁగా నంతట ననంగ ♦ నంత ననంగా
దనరుం బశ్చాదర్థము
(కనకాచలచాప చంద్ర ♦ ఖండకలాపా.) 42

టీ. వెనుకన్, తరువాతన్, పిమ్మటన్, అంతటన్, అంతన్, - ఇవి ౫ ను అనంతరమనుటకుఁ బేరులు,

క. పల్లఱపులు రజ్జులనం
బ్రల్లదము లనంగ వ్యర్థ ♦ భాషణములకున్
బేళ్ళై వర్తిలు నోలిగ
(నుల్లోకజయాభిసరణ ♦ యురగాభరణా) 43

టీ. పల్లఱపులు, రజ్జులు, ప్రల్లదములు - ఇవి 3 ను పనికిమాలిన బడాయిమాటలకుఁ బేరులు.

క. కైసేఁ తలంకరించుట
బేసియనన్ విషమమునకుఁ ♦ బేర్లై వెలయున్
సేసలు దీవన బ్రాలన
భాసిలు మంత్రాక్షతలకుఁ ♦ బర్యాయములై 44

* పాసెను. పాయుధాతువు భూతైకవచనము బాల - క్రియ 34 సూత్రముచే యకారమునకు సకారాదేశము.

టీ. కై సేత. (కై + చేత ఈ ౧ యు అలంకరించుట, చేసిసరి. కాని సంఖ్య, సేసలు, పీవనబ్రాలు ఈ ౨ ను మంత్రాక్షతలకు నామములు,

క. కోరనఁ బాలన నంశం
బేఱన వాఁక యననదికి ♦ నెసఁగును బ్రేళ్ళ
నీరాజనంబు పేళ్ళగు
నారతి నివ్వాళి యనఁగ [నంగజదమనా]. 45

టీ. కోరు, పాలు - ఈ ౨ ను భాగమునకు నామములు. ఏఱు, వాఁక - ఈ ౨ ను నదికి నామములు. ఆరతి, (ప్ర. హారతి) నివ్వాళి - ఇవి ౨ ను నీరాజనమునకు నామములు,

ఆ. మొఱవోయెననఁగ ♦ మొద్దువోయె ననంగఁ
గుంఠమయ్యెననుట ♦ కుం దనర్చు
శాతమునకు నాఖ్య ♦ లై తనరారును
జుఱుకు వాఁడి తెగువ ♦ కఱకనంగ 46

టీ. మొఱవోయి (మొరవ + పోయె) మొద్దువోయె (మొద్దు + పోయె) ఇవి ౨ ను పదును లేనివయ్యె ననుటకుఁ రులు. చుఱుకు, వాఁడి, తెగువ, కఱకు - ఇవి ४ ను పదునుకుఁ బేరులు.

సీ. యామికులకు నాఖ్య లై ♦ ప్రవర్తిలుచుండు
నారెకు లనఁగఁ ద ♦ లారులనఁగఁ
గళ్ళెంబు వాగెనాఁ ♦ గను ఖలీనంబు పే
ళ్ళలరు దంతంబు పే ♦ రౌడనంగఁ
దఱపి నా ముదురు నాఁ ♦ దరుణేతరం బంట
యించ చనఁ జెఱ కన ♦ నిక్షువలరు

నష్టం బొనర్చె నం ♦ టకు నాహ్వాయము లయ్యెఁ
బోకార్చె ననగఁ గో ♦ ల్పుచ్చె ననఁగఁ

తే. గుదె యనఁగ దుడ్డనంగను ♦ గదకుఁ బేళ్ళు
ఇవ మనగ మం చనంగను హిమముపేళ్ళు
కాన యన నడవి యనంగఁ ♦ గాననంబు
షడ్ఢకుఁడు తోడియల్లుఁడు ♦ జగిలెఁ డనఁగ. 47

టీ ఆరెపలు, తలారులు=ఇవి ౨ ను తలవర్గకుఁ బేరులు. కళ్ళెము, వాగె-ఇవి ౨ ను ఖలీనమునకుఁ బేరులు. ఔడు-రూ. అవుడు-ఇది ౧ యు దంతము పేరు. తఱపి, ముదురు ఇవి ౨ ను లేఁతది కానిదానికి నామములు. ఇందు, (ప్రకృతి. ఇక్షువు.) చెఱకు-ఇవి ౨ ను ఇక్షువునకు నామములు. పోకార్చె, కోల్పుచ్చె-రూ. కోలుపుచ్చె- ఇవి ౨ ను నష్టము చేసెననుటకు బేరులు. గుదె, దుడ్డు-ఇవి ౨ ను గదకుఁ బేరులు. ఇవము, (హిమముప్రకృతి.) మంచు-ఇవి ౨ ను హిమమునకుఁ బేరులు. కాన, (ప్ర. కాననము.) అడవి (ప్ర అటవి) - ఇవి ౨ ను అరణ్యమునకుఁ బేరులు. తోడియల్లుఁడు, జగిలెఁడు - ఇవి, ౨ ను షడ్ఢకునికిఁ బేర్లు.

క. తేనియ యన జున్నన నభి
ధానంబులు మధువునకును ♦ దనరుం బేళ్ళై
పానకము చెఱకుపా లనఁ
గా నిక్షురసంబునకును ♦ (గంతేకాలా) 48

టీ. తేనియ, జున్ను ఇవి ౨ ను మధువునకుఁ బేర్లు. పానకము చెఱకుపాలు-ఇవి ౨ ను చెఱకురసమునకు నామములు.

క. ఉడిగెను జాలించెను నా
నడరు విరామం బొనర్చె ♦ ననుటకుఁ బేళ్ళై

తోడరుం బశ్చాద్భాగము
పెడ యనఁగా వెనుక యనఁగ ♦ బిఱుఁదుననంగన్.

టీ. ఉడిగెను, చాలించెను - ఇవి ౨ ను విరమించుటకుఁ బేర్లు. పెగ, వెనుక, పిఱుఁదు-ఇవి 3 ను పశ్చాద్భాగమునకుఁ బేరులు.

క. విడుమర యన విడుదల యనఁ
గడముట్టుటయనఁగ శాంతి ♦ గనుటకుఁ బేళ్లౌ
నెడ వంక చక్కి చోటన
నడరు స్థలంబునకు నాఖ్య ♦ లై (శితికంఠా) 50

టీ. విడుమర, విడుదల, కడముట్టుట - ఇవి 3 ను శాంతిగనుటకుఁ బేరులు. ఎడ, వంక, చక్కి, చోటు - ఇవి ౪ ను స్థలమునకుఁ బేరులు.

క. చనుఁ గ్రుద్ధుఁ డయ్యెననుటకు
గినిసెఁ గనలె నలిగెఁ గోప ♦ గించెననంగాఁ
దనరున్ మర్మములకుఁ బే
ళ్ళనువు లనఁగ నెఱఁకు లనఁగ ♦ నాయములనగన్. 51

టీ. కినిసె, కనలె, అలిగె, కోపగించె - ఇవి ౪ ను క్రుద్ధుఁడయ్యె ననుటకుఁ బేరులు, అనువులు, నెఱఁకులు, ఆయములు ఇవి 3 ను మర్మములకు నామములు.

ఆ. పరఁగుఁ బేళ్ళు కార్య ♦ కరునకుఁ బార్పత్తె
కాఁ డనంగ మణివ ♦ కాఁడనంగఁ
దేజరిల్లుచుండు ♦ దేవేరి దొరసాని
రాణి యనెడు పేళ్ళ ♦ రాజపత్ని. 52

టీ. పార్పత్తెకాఁడు, మణివకాఁడు-ఇవి ౨ ను కార్యకరునకు నామములు. దేవేరి, దొరసాని, రాణి-ఇవి 3 ను రాజపత్ని పేరులు.

క. మ్రింగె నన గ్రుక్కఁ గొనియె న
   నంగన్ దగుఁ గబళనం బొ ♦ నర్చె ననుటకున్
   బ్రుంగె మునింగె ననఁగ (న
   నంగహరా) మగ్నమయ్యె ♦ ననుటకుఁ బేళ్ళు. 53

టీ. మ్రింగె, గ్రుక్కఁగొనియె-అవి ౨ ను కబళనముఁజేసెననుటకుఁ బేరులు. బ్రుంగె, మునింగె-ఇవి ౨ ను మగ్నమయ్యెననుటకుఁ బేరులు.

సీ. ఆఖ్యలై తనరు ధ ♦ నాగారమునకును
      గ్రాణం బనంగ బొ ♦ క్కసమనంగ
   నాస్థానమండపా ♦ హ్వాయములై తనరు హ
      జారంబనంగ మో ♦ సల యనంగ
   దయకు నీరెం డభి ♦ ధానంబులయ్యెను
      కనికర మనఁగ న ♦ క్కటిక మనఁగ
   బాల్యస్థునకుఁ బేళ్ళు ♦ బరిఢవిల్లును చిన్న
      వాఁ డనఁ గొండిక ♦ వాఁడనంగ

తే. సంధ్యకాఖ్యలు మునిమాపు ♦ సంజయనఁగ
   జూద మన నెత్త మనఁగ దు ♦ రోదరంబు
   జడియనఁగ వాన యనఁగ వ ♦ ర్షంబు పేళ్ళు
   నోలి యుంకువ యన శుల్క ♦ మొప్పు (నభవ). 54

టీ. ఉగ్రాణము, బొక్కసము, ఈ ౨ ను ధనముంచెడి గృహాము నకుఁ బేరులు, హజారము॥ రూ॥ హోజారము, మోసల-ఈ౨ ను ఆస్థాన మండపమునకుఁ బేరులు. కనికరము, అక్కటికము-ఈ ౨ ను దయకుఁ బేరులు. పిన్నవాఁడు, కొండికవాఁడు - ఈ ౨ ను బాలునకుఁ బేరులు- మునిమాపు, సంజ-ఈ ౨ ను సంధ్యాకాలము పేర్లు. జూదము, (ప్రకృతి-

ద్యూతము. నెత్తము-ఈ ౨ ను ద్యూతమునకు నామములు. జడి, వాన-ఈ౨నువర్షమునకుఁ బేర్లు. ఓలి, ఉంకువ - ఈ౨ నుశుల్కమునకుఁ బేరులు.

సీ. పయ్యెద యనఁగను ♦ పైఁగ యనంగ సం
వ్యానంబునకు నాఖ్య ♦ లై తనర్చు
నొక్క పెట్ట ననంగ ♦ నువ్వెత్తుగ ననంగఁ
యుగపత్పదంబున ♦ కొప్పఁ బేర్లు
కవలు లనం బాచి ♦ క లనంగ నక్షముల్
బన్న మొచ్చె మనంగఁ ♦ బరిభవంబు
వ్యాపారమగు చెద్దు ♦ మనఁ జెద్దియనఁగను
గన్ను నఁగీలనఁ ♦ గపటచేష్ట

తే. కందుకము బంతి చెండనఁ ♦ గను దనర్చు
నలవలు చిద్రుప లన ఖం ♦ డాహ్వయములు
కాఁచువడియంబు లనఁగను ♦ గైరవళ్ళ
నంగ ఖాదిరఘుటిక (ల ♦ నంగదమన). 55

టీ. పయ్యెద, పైఁట-ఈ ౨ ను ఉత్తరీయమునకు పేర్లు. ఒక్కపెట్ట ఉవ్వెత్తుగ-ఈ ౨ ను ఒక సారిగ ననుటకుఁ బేర్లు. కవలు, పాచికలు-ఈ ౨ ను అక్షములకుఁ బేరులు. బన్నము, (ప్రికృతి, భంగము) ఒచ్చెము-ఈ ౨ ను తిరస్కారమునకుఁ బేరులు. చెద్దము, చెద్ది-ఈ ౨ ను వ్యాపారమునకుఁ బేరులు. కన్ను, కీలు-ఈ ౨ ను కపటచేష్టకుఁబేళ్ళు. బంతి, చెండు-ఈ ౨ ను కందుకమునకు బేరులు. అలవలు, చిద్రుపలు-ఈ ౨ ను ఖండములకు బేర్లు. [అనఁగా చిన్నముక్కలు) కాఁచువడియములు, కైరవళ్ళు ఈ ౨ ను ఖాదిరఘుటికలకుఁ బేళ్ళు (అనగా తాంబూలములో నుపయోగించు కాఁచు మొదలగు వస్తువులతోఁ చేసిన యుండలు).

సీ. మాఁగాని రాజ్యంబు ♦ మణివ ముద్యోగంబు
చిట్టలు చిత్రముల్ ♦ చిలుకు శరము
ఎత్తికోలు ప్రయత్న ♦ మీలువు మానంబు
బారియనంగ ను పద్రవంబు
విన్నను వనఁగఁ బ్రా ♦ వీణ్యం బెలర్చును
తార్కాణ మనఁగ ని ♦ దర్శనంబు
నిట్టపంటయనంగ ♦ నిష్కారణంబంట
బానసం బనఁగ మ ♦ హానసంబు

తే. నామ మేకాంతమునకు మం ♦ తన మనంగ
నంతిపుర మనశుద్ధాంత ♦ మలరుచుండు
నుదిరియనఁ దప్తకాంచన ♦ మొప్పుచుండుఁ
దివురుట యభిలషించుట ♦ (దేవదేవ) 56

టీ. మాఁగాని=దేశమునకుఁ బేరు. మణివము=ఉద్యోగమునకు బేరు చిట్ట=ఆశ్చర్యమునకుఁ బేరు. చిలుకు=బాణమునకుఁ బేరు. ఎత్తికోలు = ప్రయత్నమునకుఁ బేరు. ఈలువు=అభిమానమునకుఁ బేరు, బార=ఉపద్రవమునకుఁ బేరు. విన్ననువు=నైపుణ్యమునకుఁ బేరు. తార్కాణము=దృష్టాంతమునకుఁ బేరు. నిట్టపంట=కారణము లేకుండుటకుఁ బేరు. బానసము=వంటయింటి పేరు. మంతనము=ఏకాంతమునకుఁ బేరు. అంతిపురము=అంతఃపురమునకుఁ బేరు, ఉదిర=అపరంజికిఁ బేరు. తివురుట=కోరుటకుఁ బేరు.

సీ. బిట్టు గట్టనఁ జెల్లు ♦ పెద్దయుఁ దద్దయుఁ
నురవడి పరువడి ♦ యుద్దవిడియుఁ
బనివడి పదపడి ♦ బలువిడి తలకొని
నెట్టన యెంతేని ♦ నెఱి గరంబు

లలివార కేడ్తెర ♦ పెలుచ నావిరి యన
నటిముటియనఁ బొరిఁ బొరి యనంగఁ
గడుఁజాల మిగులంగ ♦ గాటం బనంగ న
త్యంతముగ ననుట ♦ కాఖ్యలయ్యె

తే. నుడుకు సెక వెట్ట వేఁడిమి ♦ యుబ్బయావి
యుక్కయన నొప్పు నామంబు ♦ లుష్ణమునకుఁ
దాల్మి యోరిమి సైరణ తాళుకొంట
సైఁచు టోర్పుట యనఁగను ♦ శాంతిపేళ్లు. 57

టీ. బిట్టు; గట్టి, పెల్లు, పెద్దయు, తద్దయు, ఊరవడి, పవుపడి, ఉద్ద విడి పా., ఉద్దండి, పనివడి, పదవడి, బలవిడి, తలకొని, నెట్టన, ఎంతేని నెటి, కరము, లలి, వారక, ఏడ్తెగ, పెలుచ, నావిరి, ఉటిముటి, పొరిఁబొరి, కడు, చాల, మిగుల, గాటము (ప్రకృతి-గాఢము) ఈ ౨౭ ను అత్యంత మనుటకుఁ బేరులు. ఉడుకు, సెక, (రూ. సెగ) వెట్ట, వేఁడిమి, ఉబ్బ, ఆవి ఉక్క ఈ ౭ ను ఉష్ణమునకుఁ బేరులు. తాల్మి, రూ. తాలిమి, ఓరిమి, సైరణ తాళుకొంట, సైఁచుట, ఓర్పుట - ఈ ౬ ను శాంతికి బేర్లు.

తే. పెద్దనిద్దురఁ జెందించెఁ బిలుకుమార్చె
గీటణంచెను గుదెతాల్పు ♦ వీటి కనిచెఁ
గూలిచెను రూపుమాపెను ♦ నేలఁగలిపె
ననఁగ హతిచేసె ననుట కా ♦ ఖ్యలు దనర్చు. 58

టీ. పెద్దనిద్దుర జెందించె, పిలుకుమార్చె, గీటడంచె, గుదితాల్పు వీటి కనిచె = యమపురికిఁ బంపెను. కూలిచె, రూపుమాపె నేలఁగలిపె - ఇవి ౭ ను చంపె ననుటకుఁ బేర్లు.

క. పరిచూర్ణ మయ్యె ననుటకు
వరుసన్ నామంబు లగుచు ♦ వర్తిలుచుండున్
దురుమయ్యెఁ బరుమయ్యెన్
నుఱుమయ్యెఁ బిండియయ్యె ♦ నుగ్గయ్యెఁ ననన్. 59

టీ. తుఱుమయ్యె, పరుమయ్యె, నుఱుమయ్యె, పిండియయ్యె, నుగ్గయ్యె-ఇవి ౫ ను చూర్ణమయ్యెననుటకు నామములు.

క. కునికె నిదురించెఁ గూర్కెను
గనుమోడ్చె ననంగ నిద్ర ♦ గనుటకుఁ బేళ్ళౌ
గనువిచ్చె ననఁగ మేల్కనె
ననఁగఁ బ్రబోధంబు నొందె ♦ ననుటకుఁ బేళ్ళౌ. 60

టీ. కునికె, నిదురించె, కూర్కెను, కనుమోడ్చెను-ఇవి ౪ ను నిద్రబోయెననుటకుఁ బేర్లు. కనువిచ్చె - మేల్కనె-ఇవి ౨ ను నిద్రలేచెననుటకు పేర్లు.

క. డులిచె వదలించె నూడ్చెను
దొలఁగించెన్ బాపెననఁగఁ ♦ ద్రోచెననంగా
వెలికొత్తె ననఁగఁ బేళ్ళై
యలరుఁ విఘటన మొనర్చె ♦ ననుటకు [శర్వా]. 61

టీ. డులిచె, వదలించె, ఊడ్చె, తొలఁగించె, పాపె, త్రోచె, వెలికొత్తె-ఇవి ౭ ను విఘటన మొనర్చెననుటకుఁ పేర్లు.

క. పొలయలుక యనఁగ నెయ్యపు
టలుక యనం బ్రణయ కలహ ♦ మమరారుఁ గుచం
బుల కొప్పు నామములు గు
బ్బ లనంగాఁ జన్నులనఁగఁ ♦ బాలిండ్లనఁగన్. 62

టీ. పాలయలుక, నెయ్యపుటలుక (నెయ్యము + అలుక - నెయ్యపు + అలుక - నెయ్యపుటలుక.) ఇవి౨ను ప్రణయకలహమునకు నామములు, గుబ్బలు, చన్నులు, పాలిండ్లు=(పాలు + ఇండ్లు) పాలుండుచోట్లు-ఇవి 3 ను కుచములకు నామములు.

తే. చౌటిమున్నీ రనఁగ నుప్పు ♦ సంద్ర మనఁగ
రాజిలుచు నుండు లవణవా ♦ రాశిపేళ్లు
కాలు వన బ్టె యనఁగను ♦ జాలనంగఁ
గుల్య కభిధాన మైపొల్చుఁ ♦ (గుధరనిలయ). 63

టీ. చౌటి మున్నీరు, ఉప్పు సముద్రము-ఇవి౨ను లవణసముద్రము పేరులు. కాలువ, రూ. కాల్వ, బటె, జాలు - ఇవి 3 భేదించె నను నామములు.

తే. పెల్లగించెను బెకలించెఁ ♦ బెటికె నన
నాఖ్యలుత్పాటన మొనర్చె ♦ ననుట కలరు
నాహ్వయంబులు ఛేదించె ♦ ననుటకెయ్యెఁ
జించె నన వ్రచ్చె నన వ్రక్క ♦ లించె ననఁగ. 64

టీ. పెల్లగించె, పెకలించె, పెటికె-ఇవి 3 ను ఉత్పాటనమొనర్చె ననుటకుఁ బేరులు. చించె, వ్రచ్చె, వ్రక్కలించె ఇవి 3 ను ఛేదించె ననుటకు నామములు.

తే. కనుమొఱఁగె నేమఱించె నాఁ ♦ గను నిగూఢ
వర్తన మొనర్చెననుట కాహ్వయము లడరు
మొయిలన మొగుళ్ళనంగను ♦ మొనయు మబ్బు
లన ఘనంబుల కాఖ్యలై ♦ (యభ్రకేశ). 65

క. పరిచూర్ణ మయ్యె ననుటకు
వరుసన్ నామంబు లగుచు ♦ వర్తిలుచుండున్
దుఱుమయ్యెఁ బరుమయ్యెన్
నుఱుమయ్యెఁ బిండియయ్యె ♦ నుగ్గయ్యెఁ ననన్. 59

టీ. తుఱుమయ్యె, పరుమయ్యె, నుఱుమయ్యె, పిండియయ్యె, నుగ్గయ్యె-ఇవి ౫ ను చూర్ణమయ్యెననుటకు నామములు.

క. కునికె నిదురించెఁ గూర్కెను
గనుమోడ్చె ననంగ నిద్ర ♦ గనుటకుఁ బేళ్ళౌ
గనువిచ్చె ననఁగ మేల్కనె
ననఁగఁ బ్రబోధంబు నొందె ♦ ననుటకుఁ బేళ్ళౌ. 60

టీ. కునికె, నిదురించె, కూర్కెను, కనుమోడ్చెను-ఇవి ౪ ను నిద్ర బోయెననుటకుఁ బేర్లు. కనువిచ్చె - మేల్కనె-ఇవి ౨ ను నిద్రలేచెననుటకు బేర్లు.

క. డులిచె వదలించె నూడ్చెను
దొలఁగించెన్ బాపెననఁగఁ ♦ ద్రోచెననంగా
వెలికొత్తె ననఁగఁ బేళ్ళై
యలరున్ విఘటన మొనర్చు ♦ ననుటకు [శర్వా]. 61

టీ. డులిచె, వదలించె, ఊడ్చె, తొలఁగించె, పాపె, త్రోచె, వెలికొత్తె-ఇవి ౭ ను విఘటన మొనర్చెననుటకుఁ బేర్లు.

క. పొలయలుక యనఁగ నెయ్యపు
టలుక యనం బ్రణయ కలహ ♦ మమరారుఁ గుచం
బుల కొప్పు నామములు గు
బ్బ లనంగాఁ జన్నులనఁగఁ ♦ బాలిండ్లనఁగన్. 62

టీ. పొలయలుక, నెయ్యపుటలుక (నెయ్యము + అలుక - నెయ్యపు + అలుక - నెయ్యపుటలుక.) ఇవి-౨ను ప్రణయకలహమునకు నామములు, గుబ్బలు, చన్నులు, పాలిండ్లు=(పాలు + ఇండ్లు) పాలుండు-చోట్లు-ఇవి 3 ను కుచములకు నామములు.

తే. చౌటిమున్నీ రనఁగ నుప్పు ♦ సంద్ర మనఁగ
రాజిలుచు నుండు లవణవా ♦ రాశిపేర్లు
కాలు వన బట్టె యనఁగను ♦ జాలనంగఁ
గుల్య కభిధాన మైపొల్చుఁ ♦ (గుధరనిలయ). 63

టీ. చౌటి మున్నీరు, ఉప్పు సముద్రము-ఇవి-౨ను లవణసముద్రము పేరులు. కాలువ, రూ. కాల్వ, బట్టె, జాలు - ఇవి 3 భేదించె నను నామములు.

తే. పెల్లగించెను పెకలించెఁ ♦ పెఱికె ననఁగ
నాఖ్యలుత్పాటన మొనర్చె ♦ ననుట కలరు
నాహ్వయంబులు ఛేదించె ♦ ననుటకయ్యెఁ
జించె నన వ్రచ్చె నన వ్రక్క ♦ లించె ననఁగ. 64

టీ. పెల్లగించె, పెకలించె, పెఱికె-ఇవి 3 ను ఉత్పాటనమొనర్చె ననుటకుఁ బేరులు. చించె, వ్రచ్చె, వ్రక్కలించె ఇవి 3 ను ఛేదించె ననుటకు నామములు.

తే. కనుమొఱఁగె నేమఱించె నాఁ ♦ గను నిగూఢ
వర్తన మొనర్చెననుట కాహ్వయము లడరు
మొయిలన మొగుళ్ళనంగను ♦ మొనయు మబ్బు
లన ఘనంబుల కాఖ్యలై ♦ (యభ్రకేశ). 65

టీ. కనుమొఱఁగె, ఏమరించె-ఇవి ౨ ను నిగూఢవర్తనము చేసె (అనఁగా తెలియకుండ వర్తించె) ననుటకుఁ బేర్లు. మొయిలు, మొగుళ్ళు మబ్బులు ఇవి 3 ను మేఘములకు నామములు.

క. పగ అనఁగ మార్తు రనఁగనుఁ
బగవాంద్రనఁ బగతు రనఁగఁ ♦ బరిపంథికిఁ బే
ళ్ళగు మొగ మనంగ మెక మన
మృగమునకు నభిఖ్యలయ్యె ♦ (మేరుశరాసా) 66

టీ. పగఱు, మార్తురు, పగవాంద్రు, పగతురు-ఇవి ౪ ను విరోధికి నామములు. మొగము, మెకము-ఇవి ౨ ను మృగంబునకుఁ బేర్లు.

తే. ఇంకె నడుగంటె వట్టెనా ♦ నివిరె ననఁగ
నిర్జలం బయ్యె ననుటకు ♦ నెగడుఁ బేళ్ళు
నిండె గ్రిక్కిఱిసె ననఁ బూ ♦ ర్ణించె ననుట
కాఖ్యలై తనరారు ( సు ♦ ధాంశు మకుట). 67

టీ. ఇంకె .అడుగంటె, వట్టెఇవిరె-ఇవి ౪ నునిర్జలమయ్యె ననుటకు నామములు. నిండె, క్రిక్కిఱిసె ఇవి ౨ ను పూర్ణించె ననుటకుఁ బేరులు.

తే. పెచ్చు పెరిగె ననం బురి ♦ విచ్చె మీఱె
నన విజృంభించె ననుటకు ♦ నాఖ్య లయ్యె
దిండికాఁ డనఁ దిండీఁడు ♦ తిండిపో త
నంగ భక్షకునకును ద ♦ నర్చుఁ బేళ్ళు. 68

టీ. పెచ్చుపెరిగె, పురివిచ్చె, మీఱె- ఇవి3 ను విజృంభించెననుటకు నామములు. తిండికాఁడు, తిండీడు, తిండిపోతు-ఇవి 3 ను భక్షకుని పేర్లు.

క. పెనగొనె గిఱికొనియెను వల
గొనియెన్ మెలికొనియెఁ జుట్టు ♦ కొనె సుడిగొనె నాఁ

గను నులిగొనె నన నాఖ్యల
గును వలయితమయ్యె ననుట ♦ కును (శితికంఠా). 69

టీ. పెనఁగొనె, గిజికొనె, వలగొనె, మెలికొనె, చుట్టుకొనె, సుడిగొనె, నులిగొనె-ఇవి ౭ ను వలయితమయ్యెననుటకుఁ బేరులు.

సీ. మొగరాలన స్తంభ ♦ ములు చిట్టకము దంభ
మెరగలి వనవహ్ని ♦ యెడ్డె మూర్ఖుఁ
డుడుగర యుపహార ♦ మూఅట విశ్రాంతి
మొదలని యనఁగను ♦ మూల మనుట
తఱు లన తళులు చిం ♦ ద మనంగ శంఖంబు
తఱ టనంగఁ గశాభి ♦ ధానమయ్యె
దమటనఁ గీల ప ♦ దం బగు మెట్టన
గాయకులకుఁ బేరుఁ ♦ గాణ లనఁగ

తే. మృత్యువునకును బే రయ్యె ♦ మిత్తి యనఁగ
మకుటమున కాఖ్య లగు బొమి ♦ డిక మనంగ
నోముట యనంగఁ బోషించు ♦ టూడిగంబు
సేవ కభిధానమై యొప్పు ♦ (శేషభూష). 70

టీ. మొగరాలు=స్తంభమునకు, చిట్టకము=మిషకు, ఎరవలి, పా. ఎరగలి = కాఱుచిచ్చునకు, ఎడ్డె = మూర్ఖునకు, ఉడుగర = కానుక, ఊఱట = విశ్రాంతికి, మొదలు = మూలమునకు, తఱులు=మదతలకు, చిందము = శంఖమునకు, తఱటు = కొరడాకు (తబుకు) తమట = నిప్పుమంటకు, మెట్టు= పాదమునకు, గాణ = గాయనకు మిత్తి (ప్ర. మృత్యువు) = చావునకు, బొమిడికము = కిరీటమునకు, ఓముట =పోషించుటకు, ఊడిగము = సేవకుఁ బేరు.

సీ. ఎట్ట కేల కనంగ ♦ నెనయును సకృదర్థ
మఖిలం బటంటకు ♦ నంతెవట్టు
ఏకాకి యెక్కటి ♦ నేకులు పలువురు
వేనవేల్ పెక్కండ్రు ♦ వేవు రనంగ
నలరు నోచేదర్థమై ♦ కానినాఁ డన
నేతాదృశులె యంట ♦ కిట్టివారె
మిన్నక యూరక ♦ యన్నఁ దూష్ణీమర్థ
మనుసరించి యటంట ♦ కగును దొట్టి

తే. యొండొకఁ డనంగ మఱియు వే ♦ ఱొకఁడనం బాఁతి
వాఁడు పెఱవాఁడు తక్కిన ♦ వాఁ డనంగ
నన్యునకు నాఖ్య లగుచుఁ బెం ♦ పారుచుండు
(శయఘటితశూల నైయాంగ్రఘ ♦ చక్రచేల). 71

టీ. ఎట్టకేలకు = అప్పటికనుటకుఁ బేరు. అంటంటకు=అంతయునను టకు పేరు. ఎక్కటి=ఏకాకి, పలువురు, నేనేలు, పెక్కండ్రు, వేవురు- ఈ ౪ ను అనేకులనుటకుఁ బేరు. కానివాఁడు=అటుకాక పోయినప్పుడనుటకు, ఇట్టివారె=ఈలాటివారేయనుటకు, మిన్నక, ఊరక ఈ ౨ ను తూష్ణీమర్థకములు. తొట్టి = అనుసరించి, ఒండొకఁడు, వేఱొకఁడు, బాఁతివాఁడు, పెఱవాఁడు, తక్కినవాఁడు-ఈ ౫ ను అన్యునకుఁ బేరులు.

---

## నా నా ర్థ ము లు.

క. వడియనఁగా గాలం బగు
వడి యన వేగంబునకును ♦ వర్తిలుఁ బేరై
మడి యనఁ గేదారం బగు
మడి యనఁగా శుద్ధికిని స ♦ మాహ్వాయమయ్యెన్ 72

టీ. వడి = కాలమునకు, వేగమునకు, 2 మడి = వరిచేనికి, శుద్ధికి పేర్లు.

క. ఈ డనఁగ వయసు పేరగు
నీ డన సామ్యంబునకును ♦ నెసఁగును బేరై
నా డన రాజ్యము పే రగు
నాఁ డనఁ దత్కాలమం ద ♦ నఁగఁ బెంపారున్ 73

టీ ఈడు=వయసునకు, సాటికి, 2 నాడు=దేశమునకు, అప్పుడు అనుటకును (రెండవయర్ధమున "నాఁడు" అని యరసున్నగలదు).

క. మొన యన సైన్యము పే రగు
మొన యనఁగా నగ్రభాగ ♦ మునకును బేరౌ
బొన యనఁ దూణీరం బగు
దొన యన నవసానమునకుఁ ♦ దొడరును బేరై. 74

టీ. 1 మొన = సైన్యమునకును, ముందుభాగమునకు, 2 దొన = అమ్ములపొదికి, కొనకుఁ జెల్లును.

క. వెన్ను నఁగ బీజమంజరి
వె న్ననఁ జరమాంగమునకు ♦ వెలయును బేరై

కన్ను లనం బర్వంబులు
కన్ను లనన్ లోచనములు ♦ (కంఠేకాలా). 75

టీ. వెన్ను = కంకికి, వీపునకు, 2 కన్ను = గణుపునకు, నేత్రము నకుఁ జెల్లును.

క. తమ్మి యనఁ దరువిశేషము
తమ్మి యనం బంకజాభి ♦ ధానం బయ్యెన్
నెమ్మియనఁ బ్రియము పేరగు
నెమ్మి యన మయూరమున కు ♦ నెగడుం బేరై. 76

టీ. 1 తమ్మి = వృక్షవిశేషమునకు, తామరకు, 2 నెమ్మి=సుఖము నకు, నెమిలికిఁ జెల్లును.

క. దండ యనన్ సాన్నిధ్యము
దం డన సుమమాలికాభి ♦ ధానం బయ్యెన్
మం డనఁ బ్రకోష్ఠ మయ్యెన్
మం డన మృత్పాత్రకునుస ♦ మాహ్వయమయ్యెన్. 77

టీ దండ = చేరువకు, పూలదండకు, 2 మండ = ప్రకోష్ఠమునకు, మంటికుండకుఁ జెల్లును.

క. తెలుఁగుం గబ్బపుమర్మము
తెలుఁగు కవీంద్రులకుఁదేట ♦ తెల్లము గాఁగన్
దెలియఁగ నడిదము సూరయ
చెలువారఁగ నాంధ్రనామ ♦ శేషముఁ జెప్పెన్. 78

సటీకాంధ్రనామ శేషము.

సంపూర్ణము.

శ్రీరస్తు.

# ఆంధ్రనామసంగ్రహము

# అకారాదిశబ్దానుక్రమణిక

---

శ్రీ రస్తు.

ఆంధ్రనామశేషమందలి

# అకారాదిశబ్దానుక్రమణిక.



# అష్టాదశ పురాణ సారసంగ్రహము.

## నాలుగు భాగములు
## భాగము 1-కి రు. 1—0—0

కలియుగములోని జనులు వేదార్థమును తెలిసికొని తరింపజాలరని వ్యాసాది మహర్షులు ఆ వేదార్థమును పురాణ రూపముగా పరిణమింపజేసిరి. అట్టి పురాణములు 18. పురాణములనిన సామాన్యమైనవికావు. చతుర్విధ పురుషార్థ సాధకంబులగు విషయములు బాగుగ దెలియజేయు మహా గ్రంథములు. పురాణపఠనము - మానవులకు సమస్త ధర్మాధర్మముల బోధించును - విజ్ఞానమిచ్చును - సంపదలగూర్చును. ఇహమున సౌఖ్యము గూర్చును. మోక్షమునకు మార్గమును జూపును. ఇక మానవునకుగావలసినదేమున్నది? ఇవియన్నియు సంస్కృతముననుండుటచే ఇహపరసాధనమగునాపురాణముల సారము సమస్తజనులకును దెలియునట్లుఆంధ్రమున వ్రాయించి, బహుశ్రమకోర్చి ప్రకటించితిమి. స్త్రీబాలురు సైతము దెలిసికొన జాలునంతటి సులభశైలిలో ఈ గ్రంథము లలరారుచున్నవి. ప్రబోధ పేటికలనదగు నీ గ్రంథరాజముల మీరు చదివి-యందలి మహా విషయంబుల గ్రహించి కృతార్థులగుడు.

ఈ గ్రంథరాజములగూర్చి యనేకులు సదభిప్రాయము లిచ్చియున్నారు. ఆంధ్రదేశమున ప్రతి గృహమున నుండ వలసిన గ్రంథములని తలంపుడు.

వలయువారు:— రామా అండ్ కో., ఏలూరు.

# సాంబనిఘంటువు.



అవతారిక: కస్తూరిరంగకవి యీ యాంధ్రనిఘంటువును శ్రీ సాంబమూర్తి కంకితముచేయుచు, గ్రంథ రచనాపద్ధతులను దెల్పుచున్నాఁడు.—

సీ. శ్రీ వెలయంగ దే ♦ శీయముల్ దెనుఁగులుఁ
దద్భవంబులుఁ గూర్చి ♦ దైవవర్గ
దనరు మానవవర్గ ♦ స్థావరవర్గ తి
ర్యగ్వర్గ ననునాలు ♦ గలవరించి
జల్లు లుంపక వ్యర్థ ♦ శబ్దముల్ రానీక
కుంటి నడతగాక ♦ కొఱుకు లేక
యుర్వీజనంబుల ♦ కుపకారసరణిగా
నాంధ్రనామనిఘంటు ♦ వనెడుకృతిని

తే. గవులదయచేతనీకటా ♦ క్షంబువలన
సీసశతకంబుఁ జెప్పెదఁ ♦ జిత్తగింపు
దనుజ సమవర్తి ♦ భక్తహృ ♦ దబ్జవర్తి
సకలసురచక్రవర్తి • శ్రీ సాంబమూర్తి. 1

తా. దేవతల కందఱకుఁ జక్రవర్తివి, రాక్షసాంతకుఁడవు,భక్తులహృదయకమలములందు వసించువాఁడవునైన యోసాంబమూర్తీ కస్తూరిరంగకవి

యను నేను సొంపుగా నాంధ్రభాషయందు అన్యదేశీయపదములు, ఆంధ్ర జైత్ర్యపదములు, సంస్కృతభవప్రాకృతభవములు వీనినింగూర్చి దేవవర్గ, మాన వవర్గ, స్థావరవర్గ, తిర్యగ్వర్గ అను నాలుగు వర్గములను సవరించుచున్, మొదలగు పాదపూరణపదములను, అర్థహీనములైన పదములను మానియు, దుర్న్యయకాఠిన్యము లేక, చదువబడనుండునట్టి సులభశైలిని సకలజనోపకా రముకొఱకు "సాంబ నిఘంటువు" అను గ్రంథమును నీ కృపవలనను, నీకటాక్షము వలనను నూఱు సీసపద్యములుగా రచించెదను. దీనిని చిత్తగింపుము.

## —♦ దేవవర్గు ♦—

సీ. ముక్కంటితొలిపట్టి ♦ మొట్టికాయల మెప్పు
గొప్పబొజ్జగలాఁడు ♦ గుజ్జువేల్పు
గబ్బుచెక్కిళ్ళమె ♦ కము మోముగలసామి
కలుఁగులాయపుఁ జేజి ♦ బలుసిపాయి
గుంజిళ్ళుపెట్టించు ♦ కొనుమేటి సిళ్ళారి
కుడుముదాలుపు పెద్ద ♦ కడుపువేలు
పొంటిపల్లు దొర మ ♦ క్కంటిపండుల మెక్కు
దేవర చిలువ జం ♦ దెముల మేటి

తే. జమిలితల్లులబిడ్డ పె ♦ ద్ద మెయిప్రోడ
చేటచెవులదణి పని ♦ చెఱుపువాఁడు
మొదటివేలుపు వెనకయ్య ♦ పుంజుదారి
పెద్ద యనఁదగు గణపతి ♦ పేళ్ళు సాంబ. ౨

టీ. ముక్కంటితొలిపట్టి = త్రినేత్రుఁడగు శివుని మొదటి కొ వుఁడు, మొట్టికాయలమెప్పు = (భక్తులు తమ తలలయందు వేసికొను)

పిడికిటిపోటులకుఁ దలయూఁచువాఁడు, గొప్ప బొజ్జగలాఁడు=పెద్దకడుపుగలవాఁడు, గుజ్జువేల్పు=పొట్టిదేవుఁడు, గబ్బుచెక్కిళ్ళమెకము మోము గలసామి=మదగంధముగల గండస్థలములుగల మృగంబుయొక్క (అనఁగా ఏనుఁగుయొక్క) శిరంబుఁదాల్చినదేవుఁడు, కలుగులాయపుఁదేజి బలుసిపాయి = బొక్కలాయముగాఁగల వాహనము-అనఁగా ఎలుక వాహనముగాఁగల గొప్పబంటు, గుంజిళ్ళు పెట్టించుకొనుమేటి = భక్తులచేతగుంజిళ్ళు పెట్టించుకొనునట్టి దేవర, పిళ్ళారి, కుడుముదాలుపు = మోదకములు హస్తమందుఁగలవాఁడు, పెద్దకడుపు వేలుపు = లంబోదరుఁడు, ఒంటిపల్లు దొర = ఏకదంతుఁడగు దేవుఁడు, ముక్కంటి పండుల మెక్కు దేవర = (ముక్కంటిపండులు = టెంకాయలు) వానినిఁ దినునట్టి వేలుపు, చిలువ జందెములమేటి = పాములను యజ్ఞోపవీతముగాఁ దాల్చినదేవుఁడు, జమిలి తల్లులబిడ్డ=గంగా పార్వతులనెడి యిరువురు తల్లులకుఁ గొమరుఁడు, పెద్దసుయిప్రోడ = గొప్పశరీరమును దాల్చిన దేవుఁడు, చేటవీనులదణి = చేటలవంటి చెవులుగల ప్రభువు, పనిచెఱుపువాఁడు = (తన్ను గొలువనివారి) కార్యములఁ జెఱుచువాఁడు, మొదటివేలుపు = (ఒక్కొక్క కార్యమునందును) మొదట బూజసేయఁబడు దేవుఁడు, వెనకయ్య, పుంజుదారిపెద్ద = కుక్కుటధ్వజుఁడగు కుమారస్వామికి అన్న, ఈ ౨౦ వినాయకుని పేర్లు.

సీ. చౌవంచమోముల ♦ సాహేబు జాళువా
గుబ్బలివిలుకాఁడు ♦ గిబ్బరాతు
జక్కులదొరనేస్తి ♦ జన్నంపుఁబగవాఁడు
పొడలగింటముదాల్పు ♦ పునుకదారి
వినువాఁక మోపరి ♦ వెండికొండదునీఁడు
మినుజుట్టు దేవర ♦ మిత్తిమిత్తి
మంచుమలల్లుఁడు ♦ మరుగొంగ ముక్కంటి
నెలదారి ముమ్మొన ♦ యలుఁగుమేటి

తే. విసపుమేఁతరి తిగఁబ్రోలి ♦ వేఁటకాఁడు
కప్పుపైదువపెనిమిటి ♦ గాములదొర
వేల్పుదణిఁగన్నతఁడు గుజ్జు ♦ వేల్పుతండ్రి
బేసికన్నామి యన నీదు ♦ పేళ్ళు సాంబ. ౫

టీ. చౌవంచమోములసాహేబు = అయిదు ముఖములుగల ప్రభువు, జాళువాగుబ్బలివిలుకాఁడు = మేరుపర్వతము విల్లుగాఁ గలవాఁడు, గిబ్బరౌతు = ఎద్దునెక్కి తిరిగెడువాఁడు, జక్కులదొరనెస్తి = యక్షుల కధిపతియగు కుబేరునికి స్నేహితుఁడు, జన్నంబుఁబగవాఁడు = (దక్షప్రజాపతి యొక్క) యాగమును ధ్వంసము చేసినవాఁడు, పొడలగంటువాల్వ = మచ్చలుగల జంతునేత వస్త్రమును (వ్యాఘ్రచర్మమును) ధరించువాఁడు, పుఱ్ఱెకిదారి = బ్రహ్మకపాలమును ధరించినవాఁడు, వినువాఁకమెఱపరి = (వినువాఁక = ఆకాశమందుపాఱు నేఱు) - గంగాదేవిని జడయందు దాల్చినవాఁడు, వెండికొండదునేఁడు = రజతగిరి (కైలాసము) యునికిపట్టు గాఁగలవాఁడు, మినుజొట్టుదేవర = ఆకాశమె జుట్టుగాఁగల వేల్పు, మిత్తికి మిత్తి = మృత్యువునకు మృత్యువు (అనఁగా మృత్యువును సంహరించినవాఁడు 2 ను మృత్యుశబ్దభవములు) మంచుమలయల్లుఁడు = హిమవత్పర్వతమునకు అల్లుఁడు, మరుగొంగ = మన్మథునికి శత్రువు, ముక్కంటి = త్రినేత్రుఁడు, నెలదారి = చంద్రుని (మౌళియందుఁ) దాల్చినవాఁడు, మున్మొనయలుఁగుమేటి = మూఁడుకొనల యాయుధమును (త్రిశూలమును) దాల్చినవాఁడు, విసపుమేఁతరి = విషమును భక్షించినవాఁడు, తిగఁబ్రోలివేఁటకాఁడు = త్రిపురములను ధ్వంసముచేసిన దేవుఁడు, కప్పుపైదువపెనిమిటి (కప్పు పైదువ = నల్లని స్త్రీ-పార్వతి - ( టుగాగమము ) పార్వతికిభర్త, గాములదొర = ( గాములు = భూతములు - గ్రహశబ్దభవము.) భూతములకు రేఁడు, వేల్పుదణిఁగన్నతఁడు = దేవతల సేనానాయకుఁడగు కుమారస్వామికిఁ దండ్రి, గుజ్జువేల్పుతండ్రి = వామనుండగు వేల్పునకు

(వినాయకునిఁ) దండ్రి, వేసికస్వామి = (మూఁడు అనునది వేసిసంఖ్య) త్రినేత్రుఁడగు వేల్పు - ౨౩ శివుని పేళ్ళు.

సీ. వెన్నుఁడు పెరుమాళ్ళు ♦ వేగంటిసైదోడు
కవ్వపుమలదాల్పు ♦ కఱ్ఱినేస్తి
చిలువపానుపుదంట ♦ తెలిదీవిమన్నీఁడు
బటువుఁగైదువుజోదు ♦ బమ్మతండ్రి
కఱివేల్పు మలునయ్య ♦ కడలి యల్లుఁడు సంకు
దారి గరుడిరౌతు ♦ తమ్మికంటి
పది వేసములదిట్ట ♦ యెదమచ్చ గలసామి
యడుగువాఁకగలాఁడు ♦ పుడమినంటు

తే. మొసలివాయొంట్లతాల్పు ర ♦ క్కసులగొంగ
లచ్చిమగఁ డుడ్డకేలుగ ♦ లాఁడు పుట్టు
వడుగు తామరపొక్కిలి ♦ వాఁడు పసిఁడి
వలువ తాల్పన హరిపేరు ♦ లలరు సాంబ 4

టీ, వెన్నుఁడు = విష్ణుశబ్దభవము) పెరుమాళ్లు (ఇది ద్రవిడభాషలోని పదము - కోవెలవంటిది.) వేకంటిసైదోడు = సహస్రాక్షుఁడగు దేవేంద్రునకు తమ్ముఁడు (ఉపేంద్రుఁడు) కవ్వపుమలదాల్పు = మందర పర్వతమును ధరించినవాఁడు, కఱ్ఱినేస్తి = (నేస్తి = నేస్తముగలవాఁడు) అర్జునునికిఁ జెలికాఁడు, చిలువపానుపు దంట = శేషుఁడే శయ్యగాఁగల నేరుఁడు, తెలిదీవిమన్నీఁడు= శ్వేతద్వీప మునికిపట్టుగాఁగలవేలుపు, బటువుఁగైదువుజోదు = దిటవగు నాయుధమును (సుదర్శనమును) ధరించినవాఁడు, బమ్మతండ్రి = బ్రహ్మదేవునికి జనకుఁడు, కఱివేల్పు = నల్లని దేవుడు, మఱునయ్య = మన్మధునకు జనకుఁడు, కడలియల్లుఁడు = (పాలసముద్రమునందుఁ బుట్టిన లక్ష్మికి మగఁడగుటచే) పాలసముద్రమునకు నల్లుఁ

డు, సంకుదారి = పాంచజన్యమనెడి శంఖమును దాల్చినవాఁడు. గరుడి రౌతు = గరుడవాహనమెక్కెడి దిట్ట, తమ్మికంటి = కమలాక్షుఁడు, పదివేసముల దిట్ట = దశావతారముల నెత్తిన వేలుపు, ఎదమచ్చగల సామి = ఱొమ్మునందు శ్రీవత్సమను మచ్చగలదేవుఁడు, అడుగువాఁకగలాడు= పాదమునందు నదిగలవాఁడు, (విష్ణువుయొక్క పాదమునందు గంగాదేవి పుట్టినది యని ప్రసిద్ధి) పుడమినంటు = భూదేవికిఁ జెలికాఁడు, మొసలి వాఱెముంట్లతాల్పు = మొసలి నోటివలెనుండు కర్ణభూషణములను దాల్చినవాఁడు, రక్కసులగొంగ = రాక్షసులకు విరోధి, ఇచ్చిమగఁడు= లక్ష్మీదేవికి భర్త, ఉద్దకేలుగలాఁడు = నాలుగు చేతులు గల దేవుఁడు. పుట్టువడుగు = ఎల్లప్పుడు బ్రహ్మచర్యవ్రతము పూనినవాఁడు, (విష్ణుఁడు అస్ఖలిత బ్రహ్మచారి యని పురాణప్రసిద్ధి.) తామరపొక్కిలివాఁడు = కమలముబొడ్డునందుఁగలవాఁడు, పసిడివలువతాల్పు=బంగారు పుట్టముధరించినవాఁడు. ఇవి విష్ణువు పేళ్లు.

సీ. తీవంచమోముల ♦ దిట్ట తామర చూలి
తలఁపు కేళాకూళి ♦ పులుఁగు రౌతు
తగవుల జడదారి ♦ తండ్రి వేలుపుఁబెద్ద
మాటల జవరాలి ♦ మగఁడు నలువ
యలరులవిలుకాని ♦ యన్న మేలిమిబొజ్జ
గలదుముదారి ♦ ప్రాఁ బలుకులదణి
నుసురాకులెక్కఁ జె ♦ న్నుగ వ్రాయుకరణీకుఁ
డచ్చంపుఁదమ్మిపై ♦ నమరుజాణ

తే. నిక్కపుజగంబు ప్రోచుమ ♦ న్నీఁడు మొదటి
జాతిదొర బమ్మ దుగినఁడు ♦ తాత జగము

లన్ని పుట్టించుమేటి త ♦ నంతఁ గల్గు
నతఁడు పజదొర యన నజా ♦ ఖ్యలగు సాంబ. 5

టీ. తీవంచమోములదిట్ట=చతుర్ముఖుఁడగు దేవుఁడు, తామరచూలి= విష్ణువుయొక్క నాభికమలమందుఁబుట్టినవాఁడు (సమాసాంతము ఇకారము). తలఁపుకేళాకూళి పులుఁగురౌతు = మానససరోవరమునందుఁ విహరించు పక్షి (హంస) వాహనముగాఁ గల బంటు, తగవులజడదారి తండ్రి = కలహములఁ బెట్టెడు మునికిఁ (నారదమునికి) దండ్రి, వేలుపుఁబెద్ద = దేవతలకు మేటియైనవాఁడు, మాటలజవరాలిమగఁడు= వాగ్దేవికి (సరస్వతీదేవికి) భర్త, నలువ=నాలుగుమోములు గలవాఁడు (సమాసాంతము). అలరుల విలుకాని యన్న=పూవిల్తునికి (మన్మథునికి) అన్న (విష్ణునికిఁ బుత్రుఁడు మన్మథుఁడు, విష్ణువు నాభికమలమందు బ్రహ్మ పుట్టుటచేత మన్మథుని కితఁ డన్నయయ్యెను), మేలిమిబొజ్జగలదు ముదార=శ్రేష్ఠమయిన (బంగారుమయమగు) కడుపును దాల్చిన మొనకాఁడు, ప్రాబలుకులదణి = వేదముల ప్రభువు, నుదురాకులెక్కఁజెన్నుగ వ్రాయునట్టి కరిణీకుఁడు = నొసలనెడు తాటాకులందు లెక్కలను సొగసుగా వ్రాయునట్టి కరణము, అచ్చంపుదమ్మిపై నమరు జాణ=తెల్లని తామరపువ్వునందుఁ గూర్చుండు నేర్పరి, (అచ్చము - ప్ర. అచ్ఛము), నిక్కపుజగంబుఁ బ్రోచుమన్నీఁడు = సత్య లోకము నేలెడు ప్రభువు. మొదటిజాతిదొర = బ్రాహ్మణులకు అధిపుఁడు. బమ్మ బ్రహ్మ శబ్దభవము). దుగినఁడు (ద్రుహిణశబ్దభవము). తాత = పితామహుఁడు, జగములన్ని పుట్టించుమేటి = లోకములకెల్ల సృష్టికర్తయగు శ్రేష్ఠుఁడు, తనంత గలుగునతఁడు= స్వయంభువు, పజదొర = పజ-(ప్ర, ప్రజ) ప్రజాపతి ఆ బ్రహ్మదేవుఁడు పేర్లు.

సీ. గట్టురాకొమరిత ♦ కప్పుముత్తైదువ
మగనియందపుమేనఁ ♦ దగిన మగువ
కఱకంఠురాణి సిం ♦ గపుఁ దేజి గలచాన
వెనకయ్య తల్లినా ♦ వెలయు గౌరి

కలుములచెలి యడ్డు ♦ కడలి బొట్టియ లచ్చి
తమ్మి గద్దియబోటి ♦ తల్లి తల్లి
పెనిమిటి యెదనుండు ♦ ననఁబోడిమరుతల్లి
నెలచెలియలు లిబ్బి ♦ నెలఁతుక సిరి

తే. యనఁగ లక్ష్మీసమాఖ్యలౌ ♦ నంచ తేజి
పొలఁతి తలవాఁకిట మెలంగు ♦ చెలువ నలువ
రాణి పలుకుల జవరాలు ♦ లచ్చికోడ
లనఁగ భారతినామంబు లమరుసాంబ.

టీ. గట్టురాకొమరిక = పర్వతములకు ఱేఁడగు హిమవంతుని కూఁతురు, కప్పుమిత్తిడువ = నల్లని రూపముగల సుందరాంగి, మగని యొడలిసగ మేలఁదగిన మగువ = ప్రియుని యందైన దేహమునందు సగము భాగము గైకొన్న కాంత, కరకంఠురాణి = శివుని దేవేరి, సింగపుఁదేజీ యెక్కుజాణ = సింహవాహనమెక్కెడి యాఁడుది. పెనయ్యతల్లి = వినాయకుని తల్లి — ఈ పార్వతీదేవి పేర్లు. కలుములచెలి = సంపదకు అధిదేవతయైన మగువ, కడలిబొట్టియ = పాలసముద్రమునఁ బుట్టినది, లచ్చి, (పరిశ్రుతి లక్ష్మి). తమ్మిగద్దియబోటి = కమలమనెడు సింహాసనమందుఁ గూర్చుండు చెలువ. తల్లితల్లి = తల్లియగు గంగకుఁ దల్లి, పెనిమిటియెదనుండు ననఁబోడి = భర్త యొక్క వక్షస్థలమునందు వాసము చేయుడు స్త్రీ, మరుతల్లి = మన్మథునికిఁ దల్లి, నెలచెలియలు = చంద్రునికిఁ జెల్లెలు, లిబ్బి నెలఁతుక = భాగ్యమునకు అధిదేవతయైన యాఁడుది. (సిరి, ప్రకృతి. శ్రీ) ఇవి లక్ష్మీదేవి పేర్లు. అంచతేజిపొలఁతి = హంసవాహనముగాఁగల బ్రహ్మయొక్క భార్య, తలవాఁకిట మెలఁగు చెలువ = తలకు వాఁకిలియైన నోటియందు మెలంగెడు కాంత, నలువరాణి = బ్రహ్మదేవుని యొక్క భార్య, పలుకులజవరాలు = వాక్కులకు (విద్యలకు) అధిదేవత యగు స్త్రీ, లచ్చికోడలు = (బ్రహ్మపత్నియగుటచే) లక్ష్మీదేవికి కోడలు. ఈ సరస్వతి పేర్లు.

సీ. అడుగుకై దువుపుల్గు ♦ పడగదు నేదారి
యరబారతల్లుల ♦ యరిదిబిడ్డ
వెనకయ్య వెనుకయ్య ♦ వేల్పులదళవాయి
చిలువలబోనంపుఁ ♦ బునుఁగురౌతు
సత్తిఁ బూనువలంతి ♦ యిత్తిగమోముల
బలియుఁడు బారచే ♦ తులుగలాఁడు
రిక్క రక్కసుమిత్తి ♦ తెల్లుకానుపుకొంచ
మల వ్రక్కలించిన ♦ మన్నెకాఁడు

తే. గట్లయేలిక మనుమఁడు ♦ కప్పుతెలువ
మేటికొమరుఁడు వేలుపు ♦ పేటిసవతి
కొడుకు ముద్దయ్య కందుఁడు ♦ కొమరుసామి
యనఁగ గుహనామధేయంబు ♦ లమరు సాంబ 7

టీ. అడుగు కైదువు పుల్గుపడగ దు నేదారి = అడుగుకైదువు పుల్గు (కాళ్ళు ఆయుధముగాఁగల పక్షియగు) కోడి టెక్కెముగాఁగల మొనగాఁడు, (కోడి=చరణాయుధము అని యమరము) అరబారతల్లులయరిదిబిడ్డ= ఆఱుగురు తల్లులకు (షట్కృత్తికలకు) ముద్దుకొమరుఁడు, వెనకయ్య వెనుకయ్య = విఘ్నేశ్వరునికి తమ్ముఁడు, వేల్పుదళవాయి = దేవతలకు సేనాధిపతి, చిలువలబోనంపుఁబునుఁగురౌతు = పాములే ఆహారముగాఁ గలిగినపక్షి (నెమలిని) వాహనముగాఁ గలిగినదిట్ట, సత్తిబూనువలంతి = శక్తిఅను ఆయుధమును ధరించినట్టి నేర్పరి. ఇత్తిగమోముల బలియుఁడు= [ఇరు + తిగ = ఇత్తిగ-రెండు-మూఁడులు-ఆఱు) ఆఱుమొగములు గలిగిన ప్రభువు - షణ్ముఖుఁడు, బారచేతులుగలాఁడు = పండ్రెండు బాహువులు గలవాఁడు, రిక్కరక్కసుమిత్తి =(రిక్కరక్కసుఁడు-అతనికి మృత్యువు;

తారకాసురుని చంపినవాఁడు, జెల్లుకాన్పు = జెల్లులోఁ బుట్టినవాఁడు (శరజన్ముఁడు), కొంచమల ప్రక్కలించిన మన్నెకాఁడు = క్రౌంచమను పర్వతము తొలచిన ప్రభువు, గట్లయేలిక మనుమఁడు = హిమవంతుని దౌహిత్రుఁడు, కప్పుతెలవమేటికొమరుఁడు = పార్వతియొక్క ముద్దుబిడ్డఁడు, వేలుపుఁటేటి సవతికొడుకు = (వేలుపు + ఏఱు = దేవతలనది) గంగాదేవికి సవతియైన పార్వతికిఁ బిడ్డఁడు, ముద్దయ్య = పిన్నవాఁడు, కందుఁడు (స్కందుఁడు - ప్రకృతి.) కొమరుసామి (కుమారస్వామి శబ్దభవము.)-౧౭ కుమారస్వామికిఁ బేళ్ళు.

సీ. తలఁపుచూలి మరుండు ♦ వలఱేఁడు చిలుకరా
తామనిచెలి గాడ్పు ♦ టరదపుదొర
జాబిల్లియల్లుఁడు ♦ చొవంచతూపుల
నెఱదంట కలుముల ♦ గరితబిడ్డ
కన్నులవిల్తుఁడు ♦ కమ్మవిల్తుఁడు పచ్చ
విలుకాఁడు చక్కెర ♦ వింటిజోదు
వెడవిలుతుఁడు తియ్య ♦ విల్తుఁడు చిగురాకు
విలుకాఁడు తుంటవిల్ ♦ గలదునీఁడు

తే. తలిరువిల్తుఁడు ననవిల్తుఁ ♦ డలరువిల్తుఁ
డించువిల్కాఁడు రాచిల్క ♦ నెక్కురౌతు
మీను మొసలిసిడెంబుల ♦ మేఁటితేఁటి
యల్లెవాఁ డన మదనాఖ్య ♦ లమరు సాంబ. 8

టీ. తలఁపుచూలి = సంకల్పమునందుఁ బుట్టినవాఁడు, మరుఁడు (ప్ర. స్మరుఁడు,)వలఱేఁడు - (వలపు + ఱేఁడు) మోహమునకు అధిపతి, చిలుకరౌతు = చిలుకవాహనము గాఁగలబంటు, ఆమనిచెలి = వసంతు

నకు (వసంతఋతువునకు) స్నేహితుఁడు, గాడ్పుటరదపుదొర = గాలియే తేరుగాఁగల ప్రభువు (గాడ్పు + అరదము-టుగాగమము). జాబిల్లియల్లుఁడు = చంద్రునికి **మేనల్లుఁడు**, చౌవంచతూపుల వెఱదంట = అయిదు బాణములుగల గట్టిబంటు, కలుముల గరితబిడ్డ = లక్ష్మీదేవికిఁ బుత్రుఁడు, కన్నులవిల్తుఁడు=గణుపులు గల వింటివాఁడు, కమ్మవిల్తుఁడు = మధురమైన విల్లుగలవాఁడు, పచ్చవిలుకాఁడు = పచ్చనివిల్లుగలవాఁడు, చక్కెవింటిజోదు = చెఱకువిల్లుగాఁగల బంటు, వెడవిలుతుఁడు = తేలికయిన ధనుస్సుగలవాఁడు, తియ్యవిల్తుఁడు, = తియ్యనైన విల్లుగలవాఁడు, చిగురాకు విలుకాఁడు = మామిడి మొదలగు వాని) యిగుళ్ళువిల్లుగాఁ గలవాఁడు, తుంటవిల్ గలదునేఁడు = చెఱకుతుంటవిల్లుగాఁగల ప్రభువు, తలిరువిల్తుఁడు = చిగురువింటివాఁడు, ననవిల్తుఁడు, అలరువిల్తుఁడు = పూవింటివాఁడు, ఇంచువిల్కాఁడు = చెఱకువిల్లుగాఁగలవాఁడు. రాచిల్కనెక్కురౌతు = మేటిచిలుక నెక్కుబంటు, మీనుమొసలి సిడెంబులమేటి= చేఁపలు, మొసళ్ళు టెక్కెమునందుఁగల ప్రభువు, తేఁటియల్లెవాఁడు = తుమ్మెద యల్లెత్రాడుగాఁగలవాఁడు.—౭౮ మన్మథుఁడు.

సీ. సతపేరు తత్తడి ♦ జతతేరుగలప్రోడ
యనిఁబడ్డ నెఱబంటు ♦ లరుగుత్రోవ
వెన్నునివలకన్ను ♦ వేయిచేతులదిట్ట
తిగవేలుపుల టెంకి ♦ పగటిజ్యోతి

జమునయ్య మినుమాని ♦ కము చాయ పెనిమిటి
పగలుసేయు వలంతి ♦ జగముకన్ను
నెలజోడుతమ్మిచ ♦ క్కిలిగింత వేవెల్గు
కలువలసూడు చీఁ ♦ కటులగొంగ

తే. జక్కవలయంటు ప్రొక్కుల ♦ సొక్కుసామి
బారరూపులవేల్పు ప్రాఁ ♦ బల్కుసొమ్ము

తారకాసురుని చంపినవాఁడు, ఱెల్లుకాన్పు = ఱెల్లులోఁ బుట్టినవాఁడు (శరజన్ముఁడు), కౌంచమల వ్రక్కలించిన మన్నెకాఁడు = క్రౌంచమను పర్వతము తొలచిన ప్రభువు, గట్టుయేలిక మనుమఁడు = హిమవంతుని దౌహిత్రుఁడు, కప్పుతెఱవమేటికొమరుఁడు = పార్వతియొక్క ముద్దుబిడ్డఁడు, వేలుపుటేటి సవతికొడుకు = (వేలుపు + ఏఱు = దేవతలనది) గంగాదేవికి సవతియైన పార్వతికిఁ బిడ్డఁడు, ముద్దయ్య = పిన్నవాఁడు, కందుఁడు (స్కందుఁడు - ప్రకృతి.) కొమరుసామి (కుమారస్వామి శబ్దభవము.)-౧౭ కుమారస్వామికిఁ బేళ్ళు.

సీ. తలఁపుచూలి మరుండు ♦ వలఱేఁడు చిలుకరా
తామనిచెలి గాడ్పు ♦ టరదపుదొర
జాబిల్లియల్లుఁడు ♦ చౌవంచతూపుల
నెఱదంట కలుముల ♦ గరితబిడ్డ
కన్నులవిల్తుఁడు ♦ కమ్మవిల్తుఁడు పచ్చ
విలుకాఁడు చక్కెర ♦ వింటిజోదు
వెడవిలుతుఁడు తియ్య ♦ విల్తుఁడు చిగురాకు
విలుకాఁడు తుంటవిల్ ♦ గలదునీఁడు

తే. తలిరువిల్తుఁడు ననవిల్తుఁ ♦ డలరువిల్తుఁ
డించువిల్కాఁడు రాచిల్క ♦ నెక్కురౌతు
మీను మొసలిసిడెంబుల ♦ మేఁటితేఁటి
యల్లెవాఁ డన మదనాఖ్య ♦ లమరు సాంబ. 8

టీ. తలఁపుచూలి = సంకల్పమునందుఁ బుట్టినవాఁడు, మరుఁడు (ప్ర. స్మరుఁడు,) వలఱేఁడు - (వలపు + ఱేఁడు) మోహమునకు అధిపతి, చిలుకరౌతు = చిలుకవాహనము గాఁగలబంటు, ఆమనిచెలి = వసంతు

ఁను (వసంతర్తువునకు) స్నేహితుఁడు, గాడ్పుటరదపుదొర = గాలియే తేరుగాఁగల ప్రభువు (గాడ్పు + అరదము = టుగాగమము). జాబిల్లియల్లుఁడు = చంద్రునికి **మేనల్లుఁడు**, చౌవంచతూపుల వెఱదంట = అయిదు బాణములుగల గట్టిబంటు, కలుముల గరితబిడ్డ = లక్ష్మీదేవికిఁ బుత్రుఁడు, కన్నులవిల్తుఁడు=గణుపులు గల వింటివాఁడు, కమ్మవిల్తుఁడు = మధురమైన విల్లుగలవాఁడు, పచ్చవిలుకాఁడు = పచ్చనివిల్లుగలవాఁడు, చక్కెవింటిజోదు = చెఱకువిల్లుగాఁగల బంటు, వెడవిలుతుఁడు = తేలికయిన ధనుస్సుగలవాఁడు, తియ్యవిల్తుఁడు, = తియ్యనైన విల్లుగలవాఁడు, చిగురాకు విలుకాఁడు = మామిడి మొదలగు వాని) యిగుళ్ళువిల్లుగాఁ గలవాఁడు, తుంటవిల్ గలదునీఁడు = చెఱకుతుంటవిల్లుగాఁగల ప్రభువు, తలిరువిల్తుఁడు = చిగురువింటివాఁడు, ననవిల్తుఁడు, అలరువిల్తుఁడు = పూవింటివాఁడు, ఇంచువిల్కాఁడు = చెఱకువిల్లుగాఁగలవాఁడు. రాచిల్కనెక్కురౌతు = మేటిచిలుకనెక్కుబంటు, మీనుమొసలిసిడెంబులమేటి = చేఁపలు, మొసళ్ళు టెక్కెమునందుఁగల ప్రభువు, తేఁటియల్లెవాఁడు = తుమ్మెద యల్లెత్రాడుగాఁగలవాఁడు-౨౪ మన్మథుఁడు.

సీ. సతపేరు తత్తడి ♦ జతతేరుగలప్రోడ
యనిఁబడ్డ నెఱబంటు ♦ లరుగుత్రోవ
వెన్నునివలకన్ను ♦ వేయిచేతులదిట్ట
తిగవేలుపుల ఱెంకి ♦ పగటిజోతి
జమునయ్య మినుమాని ♦ కము చాయ పెనిమిటి
పగలుసేయు వలంతి ♦ జగముకన్ను
నెలజోడుతమ్మిచ ♦ క్కిలిగింత వేవెల్గు
కలువలసూడు చీఁ ♦ కటులగొంగ

తే. జక్కవలయంటు ప్రొక్కుల ♦ సొక్కుసామి
బారరూపులవేల్పు ప్రాఁ ♦ బల్కుసొమ్ము

పెట్టెలి దాయ ప్రొద్దునాఁ ♦ బేళ్ళు దనరు
లోకబాంధవునకు శివా ♦ లోల సాంబ. 9

టీ. సతపేరుతత్తడిజతపేరుగల ప్రోడ = సప్తయను పేరుగల గుఱ్ఱములనుగట్టిన రథంబునఁబోవు నేర్పరి, అనిఁబడ్డ నెఱబంటులరుగుత్రోవ = యుద్ధమునఁ జచ్చినశూరులు పోవుమార్గము (యుద్ధమునఁజచ్చినవారు సూర్యుని భేదించుకొని వీరస్వర్గమునకుఁ బోవుదురు అని శ్రుతి). వెన్నునివలకన్ను = విష్ణువుయొక్క కుడికన్ను, వేయిచేతులదిట్ట = వేయిచేతులుగలయోధుఁడు, తిగ వేలుపులటెంకి = త్రిమూర్తులకు వాసమయినవాఁడు, పగటిజోతి = పగటియందు వెలుఁగునట్టి జ్యోతిస్వరూపుఁడు, (జోతి-ప్ర-జ్యోతిస్సు). జమునయ్య = యమునికిఁ దండ్రి, మినుమానికము = ఆకాశమునకు రత్నమయినవాఁడు-ద్యుమణి, చాయపెనిమిటి = ఛాయాదేవికిమగఁడు, పగలు సేయువలంతి = దినమునుగల్గించు నేర్పుకాఁడు-దినకరుఁడు, జగముకన్ను = లోకమునకు నేత్రమయినవాఁడు = జగచ్చక్షువు, తమ్మిచక్కిలిగింత = కమలమునకు గిలిగింతపెట్టువాఁడు, వేవెల్గు = (వేయి + వెలుఁగు) వేయి కిరణములుగలవాఁడు-సహస్రాంశువు, కలువలసూడు = కలువలకువిరోధి, చీఁకటులగొంగ = అంధకారమును బోగొట్టువాఁడు, జక్కువలయంటు = చక్రవాకపక్షులను జేర్చువాఁడు, మ్రొక్కులసొక్కుసామి = నమస్కారములకు (మెచ్చుకొని) మైమరచునట్టివేలుపు, బారరూపులవేల్పు = పండ్రెండుమేనులుగల దేవుఁడు-ద్వాదశాత్ముఁడు, ప్రాఁబల్కుసొమ్ముపెట్టె = తొలిపలుకులు (వేదములు) అనెడు భూషణములకుఁ బెట్టియవంటివాఁడు, చలిదాయ = చల్లదనమునకు విరోధి, ప్రొద్దు, (బధ్నశబ్దభవము) = సూర్యుఁడు.

సీ. కరకంతుతలమాని ♦ కము వేలుపులబువ్వ
జాబిల్లి మరుమామ ♦ చందమామ

జింకతాలుపుతొఁగ ♦ చెలికాఁడు జడదారి
కన్నాప రేఱేఁడు కడలివెన్న
చుక్కలగమికాఁడు ♦ జక్కవపగవాఁడు
చలివెల్గు రేవెల్గు ♦ చలువజోతి
వెన్ను నెడమకన్ను ♦ వెన్నెలరాయఁడు
నెలతమ్మిదాయ ♦ మున్నీటిపట్టి

తే. కందుగల దుండగీఁడు చీఁ ♦ కటులమిత్తి
పంటపైరులదొర ప్రొద్దు ♦ జంట లచ్చి
యన్న రేజోతి చందన ♦ నమరుచుండుఁ
గుముదమిత్రుని నామధే ♦ యములు సాంబ. 10

టీ. కఱకంఠు తలమానికము = శివునికి శిరోభూషణము, వేలుపుల బువ్వ=దేవతలకు ఆహారమైనవాఁడు (చంద్రునికళలలో పదునైదింటిని దేవతలలోఁగొందరు ప్రతిదినమును నొక్కొక్క డొక్కొక్కటివంతునఁదిందురు. అని శ్రుతి,) జాబిల్లి = (జాను + బిల్లి) చక్కని బింబముగలవాఁడు, మరుమామ = మన్మథునికి మేనమామ, చందమామ (చంద్రశబ్దభవము) జింకతాలుపు=జింకను ధరించినవాఁడు, తొఁగచెలికాఁడు = కలువలకు స్నేహితుఁడు, జడదారికన్నాప = అత్రిమహామునియొక్క నేత్రమువలనఁ బుట్టినవాఁడు, రేఱేఁడు=రాత్రికి ప్రభువు, కడలివెన్న = క్షీరసముద్రమునందుఁ బుట్టినవెన్న, చుక్కలగమికాఁడు = నక్షత్రములకు రాజు, జక్కవపగవాఁడు = చక్రవాకపక్షుల దంపతులకువిరోధి (వాని నెడఁబాపువాఁడని యర్థము) చలివెల్గు=చల్లనికిరణములు గలవాఁడు, రేవెల్గు=రాత్రియందుఁ బ్రకాశించువాఁడు, చలువజోతి=చల్లదనమునకురాజు, వెన్ను నెడమకన్ను-విష్ణువుయొక్క వామనేత్రము, వెన్నెలరాయఁడు = చంద్రికకుఁ బ్రభువు, నెలతమ్మిద్దాయ = కమలములకువిరోధి (చంద్రోదయమయినఁ దామరపూవులుమూసికొనును.) మున్నీటిపట్టి = సముద్రునికిఁబుత్రుఁడు. కందుగలదుం

డగీడు = నల్లని కళంకముగల దూర్తుఁడు, చీఁకటులమిత్తి = చీకటికి మృత్యువు-చీఁకటిని బోఁగొట్టువాఁడు, పంటపైరులదొర = సస్యములకు రాజు, ప్రొద్దుజంట = సూర్యునకు సాటి, లచ్చియన్న=లక్ష్మీదేవికన్నయైనవాఁడు, రేజోతి=రాత్రివెలుఁగువాఁడు చందు (ప్ర. చంద్రుఁడు)-ఇవి చంద్రుని పేళ్లు.

సీ. పదిపదులంచుల ♦ బాఁకుఁ దాల్చుదునీఁడు
కొండలఱెక్కలు ♦ కొట్టినదణి
జమిడియేఁబదుల జ ♦ న్నములు చేసినమేటి
సోమాసులకుఁ దావు ♦ సూపుజాణ
యెత్తరంపుఁ జెవుల ♦ తత్తడివత్రీఁడు
విప్పుఱెప్పలఱేఁడు ♦ వెల్లిగారు
మావటీఁడు తలఁపు ♦ మానికముగలాఁడు
నిలువెల్ల జూప్పులై ♦ వెలయువాఁడు

తే. మింటిప్రోల్సామి జడదారి ♦ యింటికోడి
పెట్టుమ్రాఁకుల వెలిగిడ్డిఁ ♦ బెనిచినదొర
మొదటిదిక్కు సుబాదారి ♦ మొయిలుజక్కి-
సామి యన నింద్రునామముల్ ♦ జరుగుసాంబ. 11

టీ. పదిపదులంచులబాఁకుఁదాల్చుదునీఁడు=(పదిపదులు నూఱు) నూఱుఅంచులుగల యాయుధమును (వజ్రాయుధమును) ధరించినమేటి, కొండఱెక్కలుకొట్టినదణి=పర్వతములయొక్క ఱెక్కలను నఱికినపేర్పు కాఁడు, జమిడియేఁబదులజన్నములు చేసినమేటి=(జమిడియేఁబదులు=నూఱు) నూఱుయజ్ఞములు చేసిన యుత్తముఁడు-(శతముఖుఁడు) సోమాసులకుఁ దావుసూపుజాణ=యాగములొనర్చినవారి 'కునికిచూపునట్టి నేర్పరి, (సోమాసి-ప్ర-సోమయాజి) ఎత్తరంపుఁజెవులతత్తడివత్రీఁడు = నిక్కకొనియుండు చెవులుగలవాహనము (ఉచ్చైశ్రవము) నెక్కెడి పెనుకాఁడు, విప్పుఱెప్పల ఱేఁడు=

...ప్పు ఱెప్పలు, తెఱచికొనియుండు ఱెప్పలుగలవాఁడు-అనిమిషులు=దేవతలు
దేవేంద్రుఁడు, వెల్లిగౌరుమావటీఁడు = తెల్లనియేనుఁగును (ఐరావతమును)
ఎక్కెడి మావటివాఁడు, తలఁపుమానికముగలాఁడు = చింతామణి గల
వాఁడు, నిలువెల్లఁజూపులై వెలయువాఁడు = దేహమెల్ల నేత్రములుగల
వాఁడు-సహస్రనేత్రుఁడు, మింటిప్రోల్‌సామి = స్వర్గపట్టణము నేలురాజు,
జడదారి యింటికోడి=గౌతమమహామునియొక్క యాశ్రమంబునఁ గుక్కుట
రూపంబుఁ దాల్చినవాఁడు, పెట్టుప్రమాకుల వెలిగిడ్డిఁ బెనిచినవాఁ = కల్ప
వృక్షములను, కామధేనువును బోషించునట్టి ప్రభువు, మొదటిదిక్కునకు దొ
రి=తూర్పుదిక్కు నేలెడు ప్రభువు (సుబాదారి-అన్యదేశ్యము.( మొయిలు
ఎక్కు సామి = మేఘములు వాహనములుగాఁ గల ప్రభువు - ఇవి
దేవేంద్రుని పేర్లు.

సీ. తగరు బాబాసాని ♦ దుగమోరపాదుసా
తెమ్మెర చెలి యన్ని ♦ తిండికాఁడు
నీటిబిడ్డఁడు కిత్తు ♦ నిప్పు ముట్టఁగరాని
బలియుఁడు సతనాలు ♦ కల దునీఁడు
కప్పుత్రోవరి తిగ ♦ కాళ్ళదేవర యగ్గి
చిచ్చింగలం బనఁ ♦ జెలఁగు వహ్ని
పోతుతత్తడిరౌతు ♦ ప్రొద్దుకూనజముండు
మిత్తిదక్కి-న మేలు ♦ మేటిజమున

తే. తోడు గుదెతాల్పు పితరుల ♦ ఱేఁడనంగఁ
గాలుని సమాహ్వయము లగు ♦ మూలఱేఁడు
త్రిమ్మరీఁడు రక్కసి పొల ♦ దిండి పోఁడు
మూఁకదణి నా నిర్ఋతిపేళ్ళు ♦ పొసఁగు సాంబ

టీ, తగరుబాబాసాని = పొట్టేలు వాహనముగాఁగల రౌతు, దుగ
మోరపాదుసా=రెండు ముఖములుగల దేవుఁడు, (పాదుసా-అన్యదేశ్యము)
తెమ్మెరచెలి = వాయువునకుఁ జెలికాఁడు, అన్నితిండికాఁడు = సర్వభ
క్షకుఁడు, నీటిబిడ్డడు = ఉదకమునందుఁ బుట్టినవాఁడు, కిత్తు, నిప్పు, ముట్టఁ
గరానిబలియుఁడు = తాఁకఁగూడనిదిట్ట, సతనాలుకలదునిఁడు = ఏడునా
లుకలుగల ప్రభువు-(సప్తజిహ్వుఁడు), కప్పుత్రోవరి = నల్లనిమార్గము గల
వాఁడు-కృష్ణవర్త్మ, తిగకాళ్ళదేవర = మూఁడుపాదములుగల వేల్పు అగ్గి
(అగ్ని-ప్రకృతి) చిచ్చు, ఇంగలము (అంగారశబ్దభవము) ౧౮ అగ్నికి పేర్లు.
పోతుతత్తడిరౌతు = దున్నపోతు నెక్కుబలియుఁడు, ప్రొద్దుకూన = సూ
ర్యునిబిడ్డఁడు, జముఁడు. (ప్రా. యముఁడు), మిత్తి, (మృత్యుశబ్దభవము).
దక్కినమేలు మేటి= దక్షిణదిక్పాలుఁడు (దక్కినము-ప్ర. దక్షిణము) జము
నతోఁడు = యమునకుతోఁబుట్టువు, గుదెతాల్పు = పాశమును దాల్చిన
వాఁడు, పెతరుల ఱేఁడు = పితృదేవతల కధిపతి-౧౦ యమునకుఁ బేళ్ళు,
మూలఱేఁడు = నైఋతిమూల కధిపతి, త్రిమ్మరీఁడు = రాత్రులందుఁ
దిరుగువాఁడు, రక్కసి (ప్రా. రాక్షసుఁడు) పొలదిండి = మాంస మాహా
రముగాఁ గలవాఁడు, సోఁకుమూకదణి = రాక్షససమూహముల కధిపతి -
౫ నైరృతికిఁ బేళ్ళు.

సీ. పడమటిదొర నీటి ♦ యొడయఁడు జడిసామి
మొసలిగుఱ్ఱమురౌతు ♦ మొయిలుఱేఁడు
వల్లెత్రాఁడుగలట్టి ♦ వాఁడు నా వరుణాఖ్య
లమరును జింక గు ♦ ఱ్ఱమువలంతి
బీదల పెనుబాద ♦ యీఁద త్రాఁచులమేఁత
గందపుమల గుఱి ♦ కాఁడు గాడ్పు
పయ్యెర తావిమో ♦ పరి వలి మరుతేరు
సుడిగొట్టు తెమ్మెర ♦ సోఁకుబూఁచి

తే. మేనుతాల్పుల కుసురైన ♦ మేటినింగి
చూలి మబ్బులపగదాయ ♦ గాలి సురటి
వీవనలపుట్టు దువ్వగా ♦ వించుజాణ
కరువలి యనంగ మారుతా ♦ ఖ్యలగు సాంబ 13

పడమటిదొర = పశ్చిమదిక్కు నేలెడువాఁడు, నీటియొడయఁడు = ఉదకముల కధిపతి (అపాంపతి) జడిసామి=వాన కధిపుఁడు, మొసలిగుఱ్ఱమురౌతు = మొసలివాహనముగాఁగల శూరుఁడు. మొయిలుఱేఁడు = మేఘాధిపతి, వల్లెత్రాడుగలట్టివాఁడు = పాశమును దాల్చినవాఁడు-ఉవరుణునకుఁ బేళ్ళు. జింకగుఱ్ఱమువలంతి= జింక వాహనముగా గల నేర్పుకాఁడు, బీదలపెనుబాధ = బీదలను జలికాలంబున మిక్కిలి బాధించునది, ఈఁద = చల్లనివాఁడు, త్రాఁచులమేఁత = పాములకాహారమైనవాఁడు, గంధపు మలగుజ్జికాఁడు = మలయపర్వతమునుండి వీఁచువాఁడు, గాడ్పు, పయ్యర, తావిమోపరి = (పుష్పాదుల గంధముదాల్చువాఁడు, వలి, మరుతేరు = మన్మథునకువరదమయినవాఁడు, సుడిగొట్టు = చుట్టివీచువాఁడు తెమ్మెర, సోఁకుబూఁచి = స్పర్శగుణముగల దయ్యము మేనుతాల్పుల కుసురైనమేటి = శరీరధారులకుఁ బ్రాణమైనమేటి, నింగి చూలి = ఆకసమునఁ బుట్టినవాఁడు, మబ్బులపగదాయ = మేఘములను జెదరఁగొట్టువిరోధి, గాలి, సురటివీవనలపుట్టు విసనకఱ్ఱలు వీచుటచేఁ బుట్టువాఁడు, దువ్వకావించుజాణ = దుమ్మును గలిగించు నేర్పరి, కరువలి ౨౦ వాయుదేవునకుఁ బేర్లు.

సీ. జక్కులపాదుసా ♦ ముక్కంటిసంగాతి
కాయకన్నెటి రొ ♦ క్కములఱేఁడు
వానీఁడు తారాజు ♦ వడిచక్కి యెకిమీఁడు
తత్తడి నెక్కుఁడు ♦ దంట యనఁగ

దనదుపేళ్ళగు జడ ♦ దారి గిబ్బసిపాయి
తిగకంటిదొర తుది ♦ దిక్కు టెంకి
యనఁగ నీశానాఖ్య ♦ లను వొందుఁ జిందము
కూఁతకైదువు బూరఁ ♦ గొమ్ము సంకు

తే. వలమురి యనంగ శంఖము ♦ వెలయుఁ జుట్టు
వాలు సుడివాలు వట్రువ ♦ వాలు బటువు
వాలు పదినూఱులంచుల ♦ వాలు బిల్ల
వాలన సుదర్శనాఖ్యలు ♦ వఱలు సాంబ. 14

టీ. జక్కులపాదుసా = యక్షులకు ఱేఁడు, ముక్కంటిసంగాతి = త్రినేత్రునకుఁ జెలికాఁడు, కాయకన్నెటి = కాయగాచినకన్నులుగలయుత్తముఁడు, రొక్కముల ఱేఁడు=ధనములకధిపతి నాఁసీడు=(నాసె+ఈఁడు) వైశ్యకులమునఁ బుట్టినవాఁడు, రారాజు=రాజులకురాజు—రారాజు, వడచక్కియొకిమీఁడు=ఉత్తరదిక్కు నేలువాఁడు, తత్తడినెక్కుడుదంట = గుఱ్ఱపువాహనము నెక్కెడిసూరుఁడు ౮ కుబేరునకు నామములు. జడదారి = జడలను (జటాజూటమును) ధరించినవాఁడు. గిబ్బసిపాయి = ఎద్దునెక్కెడిరౌతు, తిగకంటిదొర = త్రినేత్రుఁడగు ప్రభువు. తుదిదిక్కుటెంకి=కడపటిదిక్కు (ఈశాన్యమూల) యునికిపట్టుగాఁగలవాఁడు - ౪ ఈశానుని పేరులు. చిందము, కూఁతకైదువు=ఊఁదెడి యాయుధము, బూరగొమ్ము, సంకు (ప్ర. శంఖము) వలమురి=కుడితట్టుగాఁ దిరుగునది-౩విష్ణువుయొక్క పాంచజన్యము పేర్లు. చుట్టువాలు, సుడివాలు, వట్రువవాలు (ఈ 3 పదములకు గుండ్రని యాయుధము లని యర్థము.) బటువువాలు= గట్టియాయుధము, పది నూఱంచులవాలు = (పది నూఱులు = వేయి) వేయి యంచులుగల యాయుధము, బిల్లవాలు = బిళ్ళవలె గుండ్రమైన యాయుధము-౬ విష్ణువుయొక్క సుదర్శనము పేర్లు.

సీ. తుదచుక్క పేరిటి ♦ తొయ్యలి పెనిమిటి
కప్పుదేవరయన్న ♦ కలపదారి
కటివల్వప్రోడ రో ♦ కలితాల్పు తాటిపె
క్కెము మేటిబలియుఁడు ♦ జమునగొంగ
యన బలభద్రుపే ♦ ళ్ళగుఁ గ్రీడిచెలి తేరు
పులుఁగురాయఁడు తెలి మోముపక్కి
బొల్లిమోరపులుంగు ♦ నల్లనయ్యరవాలు
తొడలేనివాని సై ♦ దోడు గరుడి

వేలుపులబువ్వఁగొను జోదు ♦ వెన్నుపడగ
చిలువమేఁతరి మేలిచ్చు ♦ పులుఁగు గరుటి
తల్లివేసట వాపిన ♦ దంట యనఁగ
వైనతేయసమాఖ్యలు ♦ వఱలు సాంబ. 15

టీ. తుదచుక్క పేరిటితొయ్యలిపెనిమిటి—తుదచుక్క పేరు=నక్షత్రములలోఁ గడపటినక్షత్రముయొక్క [పేరికాంతకుఁ బెనిమిటి.] రేవతీరమణుఁడు, కప్పుదేవరయన్న=నల్లనిదేవరకు [కృష్ణునికి] అన్నయైనవాఁడు, కలపదారి = నాఁగేలు ఆయుధముగాఁగలవాఁడు, కటివల్వప్రోడ = నల్లని బట్టను ధరించిన నేర్పరి,- నీలాంబరుఁడు, రోకలితాల్పు = ముసలాయుధుఁడు, తాటిపెక్కెము మేటిబలియుఁడు = తాళధ్వజుఁడగు గొప్పబలవంతుఁడు, జమునగొంగ =యమునానదికి శత్రువు - బలరాముని పేళ్ళు. క్రీడిచెలి తేరు=అర్జునునిచెలికాఁడగువిష్ణువుయొక్క వాహనమైనవాఁడు, పులుఁగురాయఁడు = పక్షులకురాజు. తెలిమోముపక్కి = తెల్లనిముఖముగల పక్షి, బొల్లిమోరపులుంగు, [పైయర్థే.] నల్లనయ్యరవాలు = నల్లని దేవుని యొక్క రవగాలు, అస్కందితగతిని బోవు గుఱ్ఱము = విష్ణువునకు

వేగమేగాఁ బోవ సాధనమైనవాహనము, తోడలేనివాని సైదోఁడు = అనూరునికిఁ దమ్ముఁడు, గరుడి-[ప్ర - గరుడుఁడు], వేలుపులబువ్వఁ గొనుజోదు= వేలుపుల కాహారమయిన యమృతము నపహరించినబంటు, వెన్నుపడగ = విష్ణువుయొక్క ధ్వజమయినవాఁడు, చిలువమేఁతరి= పాములనుదినువాఁడు, మేలిచ్చుపులుఁగు = జనులకు మేలుకలుగఁజేయుపక్షి, గరుటి [రూ. గరుడి], తల్లినేసటవాపినదంట=తల్లియొక్క శ్రమలను బోఁగొట్టిన శూరుఁడు - ఇవి గరుత్మంతుని నామములు.

సీ. వడముడి తెమ్మెర ♦ కొడుకన భీముఁడౌ
వేగంటి కొమరుఁడు ♦ వెన్నునంటు
వెన్నుమచ్చదునీఁడు ♦ వివ్వచ్చు కవ్వడి
గెలుపుపేరుగలాఁడు ♦ క్రీడి యనఁగ
నర్జుననామంబు లగు ♦ ముత్తెరువులాఁడి
తెలివాఁగ పొందాము ♦ రలకుఁ బంట
కలికంపుతలయేఱు ♦ పెరుమాళ్ళడుగుబుగ్గ
జెడదారి చెవియూట ♦ చదలువాఁక

తే. తాటిమెక్కెముదణితల్లి ♦ తాతపనఁటి
వెల్లి మినువాఁక మిన్నేఱు ♦ వేల్పుటేఱు
తెల్లుకొనుపు సవతి త ♦ ల్లి యనఁ దనరు
నమరతటికిని నామధే ♦ యములు సాంబ. 16

టీ. వడముడి, తెమ్మెరకొడుకు = పవననందనుఁడు - అ భీముఁడు, వేగంటికొమరుఁడు = వేయికన్నులుగలదేవుని (ఇంద్రుని) పుత్రుఁడు, వెన్నునంటు=కృష్ణునికిఁ బ్రియస్నేహితుఁడు, వెన్నుమచ్చదునీఁడు = వీఁపునందు మచ్చగల సరదారు, వివ్వచ్చు [ప్ర. బీభత్సుఁడు] కవ్వడి=[కవ + వడి] రెండు చేతులతో బాణముల నేయు వాఁడు. గెలుపు పేరు గలాఁడు =

"విజయుఁడు" అను నామము గలవాఁడు, క్రీడి=(కిరీటి, ప్రకృతి). కిరీటము గలవాఁడు- ౭ అర్జునుని పేళ్ళు. ముత్తెరువులాఁడి=(మూఁడు+తెరువులు) మూఁడు మార్గములయందుఁ బ్రవహించునది-త్రిపథగ. తెలివాఁక = తెల్లని నది, పొందామరలకుఁ బంట = బంగారుతామరపువ్వుల కునికిపట్టయినది, ఱేకెంరుతలయేఱు = ఈశ్వరుని శిరసునందువశించునది, పెరుమాళ్ళడుగు బుగ్గ=విష్ణువుయొక్క పాదములయందుఁ బుట్టిన నీటియూట-విష్ణుపది) జడదారిచెవియూట=జహ్నువనెడి మహర్షి యొక్క చెవి నుండి పుట్టినది, చదలువాఁక=ఆకసమందు బాఱునది, తాటిటెక్కముదణితల్లి = తాళధ్వజుఁడగు భీష్ముని తల్లి. తాతపనఁటివెల్లి = బ్రహ్మకమండలువునందలి నీటి ప్రవాహము, మినువాఁక = ఆకసమందుఁ బాఱెడునది, మిన్నేఱు (చూ పైన) వేల్పుటేఱు (వేల్పు+ఏఱు టుగాగమము) దేవతలనది, జెల్లుకొనుపు సవతితల్లి=కుమారస్వామికి మారుతల్లి-౧౩ గంగానది పేర్లు.

సీ. వేల్పుసువారంపు ♦ విడిది వెన్నునిటెంకి
రతనాలపంట సం ♦ ద్రంబు కడలి
పుడమిముద్దియకోక ♦ మున్నీరు ప్రాయేఱు
మబ్బుపువ్వులవెల్లి ♦ మామ మామ
గట్టురాకొమరునిఁ ♦ గాచిన నేర్పరి
యేఱులమగఁడు రే ♦ యింతిమామ
ముక్కంటియమ్ముల ♦ పొదిమింటిలాయంబు
తోఁట దొడ్డి యొనద్బు ♦ నీటుకాఁడు

తే. చందువయు లచ్చితండ్రి నా ♦ జలధి పరఁగు
వెల్లయేనుఁగు చౌదంతి ♦ వేల్పుగారు
మొదటిహ త్తినా సురకరి ♦ పొదలుఁదెల్ల

జక్కినిక్కువీనులమావు ♦ చదలుతేజి
[illegible]చ్చైశ్రవముపేరు ♦ లమరుసాంబ. 17

టీ. వేల్పుసువారంపువిడిది = దేవతల వంటయిల్లు, వెన్నుని టెంకి= విష్ణువుయొక్క వాసస్థానము. రతనాలపుట = రత్నములుబండుచోటు, సందరింబు (పరి - సముద్రము). కడలి. పుడమిముద్దియగోక = భూదేవికి వస్త్రరూపమైనది. మున్నీరు-(ముందు + నీరు) పురాతనమైననీరు. ప్రాయేఱు = (ప్రాత + ఏఱు). ప్రాచీనమైనది, మబ్బుపువ్వులవెల్లి = మబ్బుపువ్వులు (మేఘపుష్పములు = నీళ్ళు). నీటి కునికిపట్టు, మామమామ = మామ యగు విష్ణువునకు మామ, గట్టురాకొమరునిఁ గాచిన నేర్పరి = (గట్టురాకొమరుఁడు = హిమవంతుని కొమరుఁడు—మైనాకుఁడు, మైనాకుని రక్షించిన సమర్థుఁడు. ఏఱులమగఁడు=నదులకు భర్త. "రేయింతిమామ=రాత్రియను కాంతకు మామ, (రాత్రి చంద్రుని భార్య యను వాడుకగనుకను, చంద్రుఁడు సముద్రునికిఁ బుత్రుడగుటచేతను రాత్రికి మామయనఁబడియె) ముక్కంటియమ్ములపొది = త్రినేత్రునకుఁ ద్రిపురసంహారసమయమున నమ్ములపొదియైనవాఁడు. మింటిలాయంబుతోఁటదొడ్డి యొనర్చు నీటుకాఁడు = ఆకాశమును (స్వర్గమును) గుఱ్ఱపు శాలగాను, చెట్లతోఁటగను, పసులదొడ్డినిగాను చేసిన నేర్పరి-స్వర్గమునఁగలయుచ్చైశ్రవమను గుఱ్ఱమును, కల్పవృక్షములును, గామధేనువునుగన్నవాఁడు, చందువయ = 'చంద్రునితండ్రి, లచ్చితండ్రి = లక్ష్మీదేవికి జనకుఁడు, ౧౩ సముద్రముపేర్లు. తెల్లయేనుఁగు చౌదంతి = నాలుగు దంతములు గలది, వేల్పుగౌరు = దేవతలయేనుఁగు, మొదటిహత్తి = మొదటి యేనుఁగు ౮ ఐరావతము పేర్లు. తెల్లజక్కి = తెల్లనిగుఱ్ఱము, నిక్కువీనులమావు= నిల్గుకొనియుండు చెవులు గల గుఱ్ఱము, చదలు తేజి=స్వర్గమందలి గుఱ్ఱము. ౩ ను ఉచ్చైశ్రవము పేర్లు,

సీ. వేలుపు టెంకి కో ♦ వెల దేవళముగుడి
యనఁగ దేవాలయా ♦ ఖ్యలు చెలంగుఁ

దెఱగంట్లు జన్నంపుఁ దిండులు జేజేలు
తొలివేల్పు పగతురు ♦ పలుకుటల్గు
మేటులు వేల్పులు ♦ మింటిత్రోవరులు ని
ద్దురలేనిప్రోడలు ♦ నరలుగనని
పెద్దలనఁగ సురా ♦ భిఖ్య లౌ విన్ప్రోలు
వేగంటి కచ్చేరి ♦ వేల్పుటెంకి

తే. యనఁగ స్వర్గము పేళ్ళగు ♦ వినుమిటారు
లచ్చరలు వేల్పుచెలు లన ♦ నమరు నమర
తరుణులకుఁ జాగరతనము ♦ తలఁపుమాని
క మనఁ జింతామణి సమాఖ్య ♦ లమరుసాంబ. 18

టీ. వేలుపుటెంకి = దేవతల యునికిపట్టు. కోవెల, దేవళము (ప్రా. దేవాలయము,) గుడి - దేవాలయము పేర్లు, తెఱగంట్లు = తెఱచికొని యుండు కన్నులు గలవారు, అనిమేషులు, జన్నంపుదిండులు = యజ్ఞములయందు హవిర్భాగములను దినువారు, జేజేలు - తొలివేల్పుపగతురు = పూర్వదేవులకు (అసురులకు) విరోధులు, పలుకుటల్గుమేటులు = మాటలె యాయుధములుగఁ గలవారు, [గీర్వాణులు] వేల్పులు = వేలుపులు. మింటిత్రోవరులు = ఆకాశమునఁ దిరుగువారు. నిద్దురలేని ప్రోడలు = నిద్రలేని నేర్పరులు, నరలుగనని పెద్దలు = [ముదిమివలన వెండ్రుకలు మున్నగువానియందుఁ గలుగు] తెల్లదనములేని గొప్పవారు. ౯ దేవతల పేర్లు. విన్ప్రోలు = ఆకసమందుండు పట్టణము, వేగంటికచ్చేరి = ఇంద్రునిసభ. వేల్పుటెంకి = దేవతలుండు చోటు - ౩ స్వర్గము పేర్లు. అచ్చరలు [ప్రా. అప్సరసలు.] వేల్పుచెలులు = దేవతాంగనలు ౨ అప్సరసల పేర్లు, చాగరతనము = ఇచ్చునట్టి రత్నము, తలఁపుమానికము = కోర్కులొసఁగు రత్నము - ౨ చింతామణి పేర్లు.

సీ. అడిగిన నోసఁగెడి ♦ యావు జేజేగిడ్డి
చదలు తోడుకు తెల్ల ♦ మొదవనంగ
సురగవిపేళ్ళగుఁ ♦ దెఱగంటి మ్రాఁకులు
పెట్టుమ్రాఁకులు మింటి ♦ చెట్టు లనఁగఁ
గల్ప కాఖ్యలగు వే ♦ గంటిగొంగలు రక్క-
సులు రేయిద్రిమ్మరుల్ ♦ సుకురుసిసులు
వేల్పుదాయలు తొలి ♦ వేల్పులు నాదైత్య
నామంబు లగు గాలి ♦ గాము నెగడి

తే. కొఱవిరాలుపు బూచి నోఁ ♦ కుడు పిసాసి
దయ్యమనఁగఁ బిశాచాభి ♦ ధానము లగు
నివము వలి మం చనంగను ♦ హిమము దనరుఁ
బిడు గనఁగ జెల్లు నశనికిఁ ♦ బేళ్ళుసాంబ. 19

టీ. అడిగిననోసఁగెడియావు = కోరినతోడుతనే యిచ్చునట్టియావు, జేజేగిడ్డి = దేవుతలగోవు, చదలుతోడుకు = స్వర్గమందుండు గోవు, తెల్లమొదవు = ధవళవర్ణమైనగోవు - ౮ కామధేనువు పేర్లు. తెరగంటిమ్రాఁకులు = దేవతలకు సంబంధించిన చెట్లు, పెట్టుమ్రాకులు = కోరినది యిచ్చుచెట్లు, మింటిచెట్టులు=స్వర్గమఁదలి వృక్షములు = 3 కల్పవృక్షముల పేర్లు. వేగంటిగొంగలు = ఇంద్రునికిఁ బగవాఁ, రక్కసులు (ప్ర. రాక్షసులు) రేయిద్రిమ్మరుల్ = రాత్రులయందుఁ దిరుగువారు, సుకురుసిసులు = (సిసులు - ప్ర. శిశువులు) శుక్రాచార్యునిశిష్యులు, వేల్పుదాయలు = దేవతలకు విరోధులు, తొలివేల్పులు = పూర్వదేవులు - ౬ రాక్షసుల పేర్లు, గాలి, గాము [ప్ర. గ్రహము.] నెగడి, కొఱవిరాలుపు = కొఱవికన్నె

త్రిప్పునది, బూచి, సోఁకుడు, పిసాసి [ప్ర - పిశాచము). దయ్యము [ప్ర. దైవము]-౭ పిశాచము పేర్లు. ఇవము [ప్ర - హిమము], వలి, మంచు - ౩ హిమము పేర్లు. పిడుగు - ౧ వజ్రాయుధము పేరు.

సీ. మిన్ను చుక్కల త్రోవ ♦ విన్నుప్పరము నింగి
వెన్నునియడుగు విన్ ♦ వేల్పుఁదెరువు
గాలితండ్రి బయ లా ♦ కసము మొగులు తెన్ను
చదలు నా గగనాఖ్య ♦ లొదవుచుండు
బవలు పగలు నాఁగ ♦ దినము పేళ్ళగు రేయి
రాతిరి రే యన ♦ రాత్రి యమరు
దెస దిక్కు కడ యన ♦ దిశ యొప్పు నెల చంద
నఁగ మాస మమరుఁ బు ♦ న్నమ యనంగ

తే. నలరుఁ బూర్ణిమకు నమాస ♦ యమవస యనఁ
జను నమావాస్య పేరులు ♦ సంజ సందె
యనఁగఁ దగు సంధ్య కాతపం ♦ బునకు నెండ
ప్రొద్దు వేండ్రం బనెడిపేళ్ళు ♦ పొసఁగు సాంబ. 20

టీ. మిన్ను, చుక్కలత్రోవ = నక్షత్రముల మార్గము, విన్ను, ఉప్పరము, నింగి, వెన్నునియడుగు = విష్ణుపది, విన్, వేల్పుఁ దెరువు = దేవతలు పోవునట్టిబాట . గాలితండ్రి = వాయువునకుఁ బుట్టుచోటు, బయలు ఆకసము [ప్ర. ఆకాశము] మొగులుతెన్ను = మేఘముల మార్గము. చదలు - ౧౩ ఆకాశము పేర్లు. పగలు. పవలు - ౨ దినము పేర్లు. రేయి, రాతిరి, రే - ౩ రాత్రి పేర్లు, దెస = [ప్ర. దిశ.] దిక్కు [ఇది సంస్కృతసమము], కడ (ప్ర. కాష్ఠ.) - ౩ దిక్కు పేర్లు. నెల, చందు - ౨ మాసము పేర్లు. పున్నమ ౧ పూర్ణిమ పేరు. అమాస, అమవస - ౨ అమావాస్య

పేళ్లు, సంజ. సందె ప్ర - సంధ్య- ౨ సంధ్యాకాలము పేళ్లు. ఎండ, ప్రొద్దు వేంద్రము - 3 ఆతపము పేళ్లు.

సీ. మెఱపులు మెఱుఁగులు ♦ మించు లనఁ దటిత్తు
లగును జుక్కలు రిక్క ♦ లనఁగ దార
లమరు జేజేతేని ♦ యరదమునీటి మో
పరి మబ్బు మొయిలనఁ ♦ బరఁగు ఘనము
తెర యల తరఁగ నాఁ ♦ బొరయు వీచికపేళ్ళు
నుఱువు నుఱు గనంగఁ ♦ గొఱలు ఫేన
మంతస్సమాభిఖ్య ♦ లగును లోపల లోన
లో నన బహిరాఖ్య ♦ లొప్పును వెలి

తే. బయలు వెలుపల నాఁగ దీ ♦ పంబు పేళ్ళు
వఱలుచుండును జోతి తి ♦ ర్వాళిక దివ్వె
యనఁగ మందోష్ణమునకు వె ♦ చ్చన యొకింత
వేఁడి యిసుమంతకాఁక నా ♦ వెలయు సాంబ. 21

టీ. మెఱపులు, మెఱుఁగులు, మించులు - 3 విద్యుత్తు పేళ్లు. చుక్కలు, రిక్కలు [ప్రా. ఋక్షములు]- ౨ నక్షత్రముల పేళ్లు. జేజేతేని యరదము = ఇంద్రునివాహనమయినది, నీటిమోపరి= నీటినిధరించునది. [జలధరము] మబ్బు మొయిలు - ౪ మేఘముల పేళ్లు. తెర, అల, తరఁగ (ప్ర. తరంగము), 3 సముద్రపుటలల పేళ్లు. నఱువు, నఱుగు. ౨ను ఫేనము పేళ్లు. లోపల, లోన, లో - 3 అంతర్భాగము పేళ్లు. వెలి, బయలు, వెలుపల 3 బహిర్భాగము పేళ్లు, జ్యోతి [ప్ర. జ్యోతిస్సు] తిర్వాళిక [ఇది ద్రావిడ పదము] దివ్వె, [ప్ర. దీపము.] - 3 దీపము. వెచ్చన, ఒకింతవేఁడి, ఇసుమంతకాఁక - 3 కొంచెపాటి యుష్ణము పేళ్లు.

క. సిస్తుగ లక్షణకవి యగు
కస్తురి రంగాఖ్యుఁడను జ ♦ గద్ధితముగ నీ
నిస్తుల దైవతవర్గును
విస్తర మొనరించినాఁడ ♦ విబుధులకరుణన్. 22

తా. చక్కఁగా లక్షణము తెలిసిన కవియైన కస్తురి రంగయ్య యను నేను లోకోపకారార్థము పండితుల యనుగ్రహముచే సాటిలేని దేవవర్గును విపులముగాఁ జెప్పితిని.

దేవవర్గు సంపూర్ణము.

---

# మా న వ వ ర్గు.

---

క. శ్రీనగజామానస లస
మాన సరోహంస నిరుప ♦ మానప్రభవ ధా
మా నవముగ నీపేరిట
మానవవర్గువు రచింతు ♦ మానక సాంబా.

తా. కాంతియుక్తురాలగు పార్వతియొక్క మానసమనెడు ప్రకాశించెడి కొలనికి రాయంచయైనవాఁడా! (పార్వతిచే నెల్లప్పుడు ధ్యానింపబడువాఁడా!) సాటిలేనికల్మికి నివాసమైనవాఁడా! ఓసాంబమూర్తీ! నీకంకితముగా నేను తప్పక నూతనముగా మానవవర్గును రచించెదను.

సీ. తొలిచదువులు ప్రాఁత ♦ పలుకులు మినుకులు
ప్రామినుకులు తొంటి ♦ బాస లనఁగ
వేదాఖ్య లగు నేల ♦ వేల్పులు తొలిజాతి
వారు మిన్కులచదు ♦ వరులు జన్ని
గట్టులు దుగపుట్టు ♦ కలు పార్లు బాఁపలు
నాఁగ బ్రాహ్మణులకు ♦ నామములగు
ఱేలు దొరలు నేల ♦ యేలుదంటలు వెన్నుని
వలబుజమునఁ గల ♦ వారు రాచ

తే. వారు ఱేఁడులు రెండవ ♦ వంగడంపుఁ
బబువులన క్షత్త్రియాఖ్యలౌ ♦ బచ్చు బేరి
మూఁడవకొలం బతఁడు నాఁడె ♦ కాఁడునల్ల

నయ్యతోడబిడ్డ కోమటి ♦ నాఁ దనర్చు
వైశ్యనామంబు లద్రి ని ♦ వాస సాంబ.

టీ. తొలిచదువులు, ప్రాఁతపలుకులు, మినుకులు, ప్రామినుకులు, తొంటిబాసలు (ఈయన్నింటికిని బూర్వవాక్యములు అని యర్థము.)-వేదము పేళ్ళు. నేల వేల్పులు-పుడమికి దేవులు (భూసురులు) తొలిజాతి వారు = అగ్రజన్ములు, మిన్కుల చదువరులు = వేదాధ్యయనము చేయు వారు, జన్నిగట్టులు = యజ్ఞోపవీతముఁ దాల్చినవారు, దుగపుట్టుకలు = ద్విజన్ములు, పార్లు (పాఱులు) = పాఱువారు, బాఁపలు -ఇ బ్రాహ్మణులకు బేర్లు. ఱేలు, దొరలు, నేలయేలుదంటలు=పుడమిని బాలించు నేర్పరులు, వెన్నుని వలబుజమునగలవారు = విష్ణువుయొక్క కుడిభాగము నుండిపుట్టినవారు, రాచవారు=క్షత్రియులు, ఱేఁడులు, రెండవవంగడంపు బబువులు = రెండవకులమునఁ (క్షత్త్రియవంశమున) బుట్టినరాజులు - ఇ క్షత్రియులు. బచ్చు, బేరి, మూఁడవకొలం బతఁడు = మూఁడవ వంశమునఁ (వైశ్యకులమున) బుట్టినవాఁడు, నాఁడెకాఁడు = నాణెము చేయువాఁడు, నల్లనయ్యతోడబిడ్డ = విష్ణువుయొక్క తొడయందుఁ బుట్టినవాఁడు, కోమటి-ఇ వైశ్యుఁడు.

సీ. కలపతాల్పులు తుది ♦ కొలమునేర్పరులు కాఁ
పులు వినువాఁకతోఁ ♦ బుట్టువు లన
నలరును శూద్రాఖ్య ♦ లమ్మ కన్నది తల్లి
యవ్వ నా మాత పేళ్ళమరుఁ దండ్రి
యబ్బ కన్నయ్య నా ♦ యన యయ్య యప్పన
జలకాఖ్య లగుఁ దమ్ముఁ ♦ డనుఁగుతోడు
తోడఁబుట్టు వనంగఁ ♦ దోఁబుట్టు వన సోద
రాఖ్యలౌ మొదటివాఁ ♦ డన్న పెద్ద

తే. యనఁగ నగ్రజుఁడగు నక్క ♦ యప్ప యనఁగ
జ్యేష్ఠ కన్యకుఁ జెల్లెలు ♦ చెల్లె చెలియ
లనఁగ దనరుఁ గనిష్ఠ కి ♦ ల్లాలు రాణి
యాలు పెండ్లా మనఁగ భార్య ♦ కగును సాంబ ౯౯

టీ. కులపతాల్పులు = నాఁగేటిని ధరించినవారు, కుదికోలమునేర్పరు
లు = కడపటి (నాలుగవ) కులమునందుఁబుట్టిన నేర్పుగలవారు, కాఁపు
లు = క్షేత్రములను రక్షించువారు, విష్ణుపాదతోఁబుట్టువులు = గంగా
నదికి సైదోడులు (శూద్రులువిష్ణుపాదమునఁబుట్టిరి యని శ్రుతి చెప్పుటచేత
ను, గంగ విష్ణుపాదోద్భవ గనుకను గంగకు శూద్రులుదోఁబుట్టువులని చెప్పఁ
బడిరి) - ౪ శూద్రులు. అమ్మ, కన్నది, తల్లి, అవ్వ - ౪ జనని. తండ్రి,
అబ్బ, కన్నయ్య ( కన్న + అయ్య ) నాయన, అయ్య = పూజ్యుఁడు,
అప్ప - ౬ జనకుఁడు, తమ్ముఁడు, అనుఁగు, తోఁడు, తోఁడబుట్టువు, తోఁ
బుట్టువు-౫ సోదరుఁడు (చిన్నవాఁడు) మొదటివాఁడు _ మొదటఁబుట్టి
నవాఁడు, అన్న, పెద్ద-౩ పెద్దతోఁబుట్టువు (అగ్రజుఁడు) అప్ప, అక్క -
౨ జ్యేష్ఠభగిని, చెల్లెః చెలియలు- ౨ కనిష్ఠభగిని, ఇల్లాలు (ఇల్లు + ఆలు,)
రాణి, ఆలు, పెండ్లాము. రూ. పెండ్లము-౫ భార్య.

సీ. అయిదువరాలు ము ♦ త్తైదువనఁబురంధ్రి
కగుఁ దోడికోఁడ లే ♦ రా లనంగఁ
బలిసోదరునిభార్య ♦ పరఁగుఁ గూఁతురు కూఁతు
కొమరిత యనఁ బుత్రి ♦ కమరుచుండుఁ
గొమరుండు బుడుకఁడు ♦ కొడుకు పట్టి యనంగఁ
పుత్రుఁడౌ బిడ బిడ్డ ♦ పూప పాప
కుఱ్ఱ చిఱుత కందు ♦ కూన నిసువు పాల
బుడుత నాశిశునామ ♦ ములు దనర్చు

తే. గోలముద్దియు ముద్దరాల్ ♦ బేల ముగుద
యనఁగ ముగ్ధాంగనకు నాఖ్య ♦ లగును ముదిమి
వాఁడుముదుకఁడు ముదిసిన ♦ వాఁడు ముసలి
ముదుసలి యనఁగ వృద్ధుపే ♦ ళ్ళొప్పు సాంబ. 4

టీ. అయిదువరాలు (అయిదువ + ఆలు, రేఫాగమము) రూ. ఐదువరాలు, ముత్తైదువ-౨ వృద్ధసుమంగలి. తోడికోడండ్రు, ఏరాలు-౨ అన్నదమ్ముల భార్యలు. కూఁతురు, కూఁతు, కొమరిత-౩ పుత్రిక. కొమరుఁడు, కొడుకఁడు, కొడుకు, పట్టి-౪ పుత్రుఁడు-బిడ, బిడ్డ, పూప, పాప, పట్టి. చిఱుతల, కందు, పాస. నిసువు రూ. నిసుఁగు పా. శిసువు, పాలబుడుతలి = చంటిబిడ్డ-౧౨ శిశువు, గోల, ముద్దియ, ముద్దరాలు (ముద్ద + ఆలు). బేల, ముగుద (ప్రా. ముగ్ధ)-౬ ముగ్ధ (ప్రాయమువచ్చిన యాఁడుది). ముదిమివాఁడు, ముదుకఁడు, ముదిసినవాఁడు, ముదుసలి, ముసలి-౬ వృద్ధుఁడు.

సీ. పిన్న కొండికవాఁడు ♦ చిన్నపడుచు పోఁడి
పసివాఁ డనెడి పేళ్ళు ♦ బాలున కగుఁ
జతురు పేళ్ళగు గిట్ట ♦ జాణ దంట వలంతి
వెరవరి ప్రౌఢ నే ♦ ర్పరి యనంగఁ
జెలికాఁడు సంగాతి ♦ చెలిమరి గాదిలి
సకియ సంగడికాఁడు ♦ సంగడీఁడు
చెలినేస్తి యనఁ జను ♦ స్నేహితునకుఁ జెల్మి
నంటు మాలిమి పొంద ♦ నంగ మైత్రి
తే. కొఱలు; గుఱచ టెంగణ గిడ్డ ♦ గిఱుకె గుజ్జు
పొట్టి యన వామనాఖ్యలౌ ♦ గట్టివాయి
ఱాఁగ జంత గయ్యాళియు ♦ నాఁగఁ దనరు
ధూర్తవనితకు దురితవి ♦ దూర సాంబ. 5

టీ. పిన్న, కొండికవాఁడు = చిన్నవాఁడు, చిన్న, పడుచు, పోఱ, రూ. పోఱ, పసివాఁడు-౭ బాలుఁడు. దిట్ట, జాణ, దంట, వలంతి, వెరవరి, (వెరవు + అరి)=ఉపాయముగలవాఁడు (మత్వర్థీయకతద్ధితాంతము) ప్రోడ ప్ర. ప్రౌఢుఁడు (నేర్పరి) నేర్పు + అరి=మత్వర్థీయకతద్ధితాంతము=సామర్థ్యముకలవాడు ౭ సమర్థుడు. చెలికాడు=సంగాతి=సంగాతము, (స్నేహము) గలవాఁడు, (సమాసాంతము) చెలిమిరి = చెలిమి + అరి.) చెలిమిగలవాఁడు, గాదిలి, సకియ (ప్ర. సఖి). సంగడికాఁడు-సంగడీఁడు, (పైరెండింటికి సంగడికలవాఁడు అని యర్థము. చెలి, నేస్తి=నేస్తముగలవాఁడు (నేస్తము + ఇ. మత్వర్థీయకతద్ధితాంతము). ౯ స్నేహితుఁడు. చెల్మి. రూ. చెలిమి, నంటు, మాలిమి, రూ. మాల్మి, పొందు-౪ స్నేహితము. కుఱుచ, టింగణ. రూ. టింగణా, గిడ్డ, గిఱక, గుజ్జు, పొట్టి ౭ కుఱుచవాఁడు. గట్రివాయి=పెద్దగొంతుగలది, జాఁగ. జంత, గయాళి = రూ. గయ్యాళి, అలక్ష్యము సేయునది—౪ ధూర్తురాలు.

సీ. కబ్బపుసేఁతరి ♦ కయి కైసరుఁడు మాట
లల్లువాఁ డను పేళ్ళు ♦ చెల్లు గవికి
బట్టులు చదువరుల్ ♦ బట్టుక్రిక్కు లనంగ
వందులకగుఁ బడ ♦ వాళ్ళు వేగు
వారు వేగరులనఁ జారులపేళ్ళొప్పు
బోయీలు బెస్తలు ♦ మోపరు లన
వాహకులకుఁ జెల్లు ♦ సాహిణి సాని రా
తనఁగ నశ్వారోహ ♦ కునకుఁదనరుఁ

తే. గట్టికలు పణిహారులు ♦ కటిక లనఁగ
వేత్రపాణుల కగు బోయ ♦ వేఁటకాఁడు
నడవిద్రిమ్మరి యనఁ గిరా ♦ తాఖ్య లెసఁగు
నన్నగళ్ళ పేడి యనషండుఁ ♦ డగును సాంబ. 6

టీ. కబ్బపునేతఁరి = గ్రంథములను రచించువాఁడు, కయి, కైస రుఁడు, మాటలల్లువాఁడు = పదము లొక్కటిగఁ జేర్చువాఁడు - ౪ కవి. బట్టులు, చదువరులు (చదువు + అరులు)=చదువగలవారు, బట్లు. ప్ర-భట్లు, క్రిక్కులు - ౪ స్తుతిపాఠకులు. పడవాళ్ళు, వేగువారు, వేగరులు-3 వేగుల వాండ్రు. బోయీలు, బెస్తలు, మోపరులు - 3 పల్లకులు మొదలగు వానిని మోయువారు. సాహిణి, సాని, రౌతు - 3 గుఱ్ఱపురౌతు. కట్టి కలు, పనిహారులు, కటికలు=బెత్తము దాల్చి కొలువుచేయు ద్వారపాలురు మున్నగువారలు. బోయి, వేఁటకాఁడు, అడవిద్రిమ్మరి=అడవులందు సంచ రించువాఁడు - కిరాతుఁడు. అన్నగళ, పేడి, నపుంసకుఁడు.

సీ. జాలరి వలతేఁడు ♦ మీలవేఁటరి యనఁ
దగుధీవరుని పేళ్ళు ♦ తడుపుదాల్పు
వడు గొంటిజందెము ♦ వాఁడు బమ్మాచారి
యన బ్రహ్మచారి పే ♦ ళ్ళ మరుగేస్తు
మనికితేఁ డింటివాఁ ♦ డన గృహస్థున కగు
నడవికాఁపు తపసి ♦ జడలదారి
నాఁ జెలువొందు వా ♦ న ప్రస్థునకు నొంటి
కాడు గోణముదాసి ♦ బోడ బీద

తే. కావులుగలాఁడు సన్న్యాసి ♦ నా వెలుంగు
యతిసమాఖ్యలు ముగితి ము ♦ త్త్రైదు వనఁగ
జక్కినసఁ బేరఁటా లన ♦ జరగుమ్మైతచి
రంటినామంబు లాపన్న ♦ రక్షసాంబ. 7

టీ. జాలరి=(జాలము + అరి,) జాలముగలవాఁడు, వలతేఁడు = వలకుఁ బ్రభువు. మీలవేఁటరి=చేపలను వేటాడువాఁడు-3 చెంబడివాఁడు. (అనగా బెస్తవాఁడు) తడుపుదాలుపు=కొల్లాయి వంటిపంచె కట్టుకొన్నవాఁడు,

వడుగు (ప్ర. వటువు.) ఒంటిజందెమువాఁడు = ఒక్కజందెము వేసికొను వాఁడు, బ్రమ్మచారి (ప్ర. బ్రహ్మచారి) ౨౹ బ్రహ్మచర్యము పూనినవాఁడు. గేస్తు (ప్ర. గృహస్థు) మనికిఱేఁడు=ఇంటియజమానుఁడు, ఇంటివాఁడు= ఇల్లుగలవాఁడు-౩ పెండ్లియయినవాఁడు. అడవికాఁపు=అడవియందువసిం చు వాఁడు-తపసి (ప్ర. తపస్వి)=తపస్సుచేయువాఁడు, జటలదారి=జటలను దాల్చినవాఁడు, ౩ వానప్రస్థుఁడు, ఒంటికాఁడు=ఏకాకి, గోఁచిముదారి= గోఁచిపెట్టుకున్నవాఁడు, బోడ, బీద. కాఁపులుగలాఁడు=కాషాయవస్త్రముఁ దాల్చినవాఁడు, సన్నాసి- ౬ సన్యాసి. ముగితిముత్తయిదువ = ముక్తినొం దిన ముత్తైదువ, జక్కిని పేరంటాలు- ౩ మృతినొందిన స్త్రీ సుమంగలి.

సీ. మూకాఖ్యలగుమూవ ♦ మూఁగ మూఁగి యనఁగఁ
గ్రుడ్డి చీఁకన నంధ ♦ కునకు జెల్లుఁ
బరువము ప్రాయము ♦ వయసు జవ్వన మన
యౌవనాభిఖ్య లౌ ♦ నందగాఁడు
వగకాఁడ మరువాఁడు ♦ వన్నెకాఁ డెమ్మెకాఁ
డొనుకాఁ డన ♦ సొగసైనవాఁడు
నీటుకాఁడనఁగ రా ♦ ణించు శృంగారికి
గోవాళ్ళు బొజుఁగునాఁ ♦ గోష్ఠకాఁడు
తే. వెచ్చకాఁడు ననువుకాఁడు ♦ వేడ్కకాఁడు
లంజెకాఁడు మిండఁడనఁ బ ♦ ల్లవుఁడు దనరు
సోయగంబు చక్కఁదనంబు ♦ సొబగు రూపు
నాఁగ సౌందర్యమునకుఁ జె ♦ న్నగును సాంబ! ౭

టీ. మూవ, మూఁగ, మూఁగి-౩ నోరులేనివాఁడు, గ్రుడ్డి, చీకు ౨ కన్నులులేనివాఁడు. పరువము, ప్రాయము, రూ. పాయము, వయసు, (ఇదిసం స్కృతసమమని తోఁచెడి) జవ్వనము (ప్ర, యౌవనము) ౫ ప్రాయము. అం

దగాఁడు=అందముగలవాఁడు, వగకాఁడు, అమరువాఁడు, ఎమ్మెకాఁడు, జౌసుకాఁడు=పోషుకలవాఁడు, సొగసైనవాఁడు, నీటుకాఁడు-౩ సొగసుచేసికొన్నవాఁడు, గోవాళ్ళు, బోజుగు, కోడెకాఁడు, వెచ్చకాఁడు = అప్పిచ్చువాఁడు,ననువుకాఁడు=ప్రేమగలవాఁడు, వేడ్కకాఁడు=తమాషాలు కలవాఁడు, లంజెకాఁడు, మిండఁడు ౨ విటపురుషుఁడు. సోయగము, చక్కఁదనము, సొబగు, రూపు-౪ సౌందర్యము.

సీ. గట్టిమనసువాఁడు ♦ గడుసరి యుక్కరి
దిటవరి దిట్టన ♦ ధీరునకగు
కుచ్చితుఁ డడిగొట్టు ♦ కూళ పెంకె బికారి
ముడికాఁడు చిలుమువాల్ ♦ మోటులుచ్చ
చెండిపోతు గరాసు ♦ మొండికట్టె తులువ
కైలాటకాఁడు ట ♦ క్కరి పిసాళి
టకటొంకు టాటోటు ♦ తవళి దబ్బలి దూబ
గడుసు కల్లరి దోస ♦ కారి చెనఁటి

తే. పాలసుఁడు లండి పిక్కరి ♦ పలువ చెడుగు
బేరజ మనంగ ధూర్తుని ♦ పేరు లమరు
బగఱు మార్తురు పగతురు ♦ పవతు రనఁగ
నహితులకు నామధేయము ♦ లమరు సాంబ. 9

టీ. గట్టిమనసువాఁడు,గడుసరి. (గడుసు + అరి),ఉక్కరి(ఉక్కు + అరి), దిటవరి(దిటవు + అరి), పైమూఁడు వచనములకు "బలిమిగలవాఁడు" అనియర్థము. దిట్ట-౬ ధీరుఁడు, కుచ్చితుఁడు (ప్ర. కుత్సితుఁడు).అడిగొట్టు, కూళ, పెంకె, బికారి, ముడికాఁడు, చిలుమువాలు, మోటు, లుచ్చ, చండిపోతు, గరాసు, మొండికట్టె, తులువ, కైలాటకాఁడు(కైలాటము + కాఁడు) = మాయోపాయముగలవాఁడు, టక్కరి = టక్కులు గలవాఁడు

పిసాళి, టకటొంకు, టాటోలు, రూ. తాటోటు, రవళి రూ. తవలి.దబ్బిలి, దూబ, గడుసు, కల్లరి = బొందలాడువాఁడు, దోసకారి= పాపకార్యము లొనర్చువాఁడు, చెనటి, పాలసుఁడు, లండి, పిక్కరి = పిక్కబలముగల వాఁడు, పలువ, చెడుగు, బేరజము-33 ధూర్తుఁడు. పగఱు, మార్తురు, పగ తురు, పవతురు-౪ శత్రువులు.

సీ. పెఱవారు కడవారు ♦ వింతవా రెడవారు
లాఁతివారన నన్యు ♦ లకుఁ జెలంగుఁ
జుట్టలు చుట్టాలు ♦ చుట్టముల్ విందులు
బందుగు లనఁ జెల్లు ♦ బంధువులకుఁ
గూర్చువాఁ డెడకాఁడు ♦ కుంటెనకాఁ డన
దాపికాఁ డన బేరుఁ ♦ దనరుచుండు
విటదూత బయకాఁడు ♦ వీణెకాఁడనఁబొల్చు
వైణికునకు గాణ ♦ పాటకుఁ డన

తే. గాయకున కగుఁ దిక్క వెం ♦ గలి వెడంగు
వెకలి వీఱిఁడి వెంబర ♦ విత్తు వెఱ్ఱి
వేఁదు అనఁగ నపస్మారి ♦ వెలయుఁ జెవిటి
విననివాఁడన బధిరాఖ్య ♦ లొనరుసాంబ. 10

టీ. పెఱవారు, కడవారు, వింతవారు, ఎడవారు, లాఁతివారు—౫ పొరుగువారు. చుట్టలు (చుట్టములు + లు, మువర్ణలోపము). చుట్టాలు (చుట్టము + లు-మువర్ణలోపము, దత్పూర్వహ్రస్వమునకు దీర్ఘము). చుట్టములు, విందులు, బందుగులు (ప్రా. బంధువు) ౫ బంధువులు. కూర్చువాఁడు = (తాంబూలాదికమును) దెచ్చియిచ్చువాఁడు, ఎడకాఁడు, తాపికాఁడు-౪ విటునిదూత. బయకాఁడు, వీణెకాఁడు-౨ వీణెవాయించువాఁడు గాణ పాటకుఁడు-౧ గానము చేయువాఁడు తిక్క, వెంగలి, వెడంగు, వెకలి,

వీటీఁడి, వెంబరవిత్తు, వెఱ్ఱి, వేఁదురు-౧౦ మఱుపుగలవాని పేళ్ళు. అపస్మారి, చెవిటి, విననివాఁడు-౨ చెవులు వినఁబడనివాని పేళ్ళు.

సీ. ఎకిమీఁడు పాదుసా ♦ యేలిక మన్నీఁడు
      సాహేబు రాయఁడు ♦ సామి పబువు
   జియ్య తుపాసి వ ♦ జీరుండు రాయలు
      దునెదారి రాచేఁడు ♦ దొర యొడయఁడు
   నేఁడనవర్తిలు ♦ నృపు పేళ్ళు పడవాలు
      దళవాయి దళ్వాయి ♦ దణి యనంగఁ
   దగుదళకర్తకుఁ ♦ దగువాఁడు వెరవరి
      తీర్పరి కార్బారి ♦ దిట్టయనఁగఁ
తే. కార్యకర్తకుఁ జెలఁగు ప్రె ♦ గ్గడనిజోగి
   ప్రెగడ మంతిరి నా మంత్రి ♦ పేర్లు వెలయుఁ
   బంగునకు లేవఁ జాలని ♦ వాఁడు పుట్టు
   మొండి పిచ్చుకుంటను పేళ్ళు ♦ పొసఁగు సాంబ. 11

టీ. ఎకిమీఁడు, పాదుసా (ఇది హిందూస్థానీపదము.) రూ. పాదుసాహి, ఏలిక, మన్నీఁడు, పా. మన్నియ. రూ. మన్నియఁడు, మన్నెఁడు మన్నె, సాహేబు (ఇది హిందూస్థానిపదము) రాయఁడు, సామి (ప్రా. స్వామి, పబువు (ప్రా. ప్రభువు), జియ్య, తుపాసి, వజీరుఁడు (ఇది హిందుస్థానీపదము.) రాయలు, దునెదారి, రూ. దునేదారి. రా, చేఁడు, దొర, ఒడయఁడు, నేఁడు-౧౭ రాజు, పడవాలు, దళవాయి, దళ్వాయి, దణి-౪ సేనానాయకుఁడు, తగువాఁడు, వెరవరి (వెరవు + అరి) = ఉపాయముగలవాఁడు, తీర్పరి (తీర్పు + అరి) = దిద్దుపాటు గలవాఁడు. కార్బారి దిట్ట-౫ కార్యములను జక్కఁగాఁజేయువాఁడు. ప్రెగ్గడ, నిజోగి, (ప్రా. నియోగి) = ఉత్తరువు చేయువాఁడు, ప్రెగడ, మంతిరి -

ర మంత్రి. లేవఁజాలనివాఁడు, పుట్టుమొండి, పిచ్చుకుంటు. రూ. పిచ్చుక కుంటు-3 పంగువు-ఈఁచఁబోయిన కాళ్ళవాఁడు.

సీ. ఎడకాఁడు గొల్లగాఁ ♦ డెడత్రోవకాపరి
గడిదొంగ దోఁపుడు ♦ కాఁడు నాఁచు
గజముచ్చు చేవాఁడి ♦ కాఁడు జాజరకాఁడు
మచ్చరి మునిముచ్చు ♦ మాయదారి
తెరువాటుకాఁడు క ♦ త్తెరదొంగ దొరకోలు
సన్న్యాసి వడికాఁడు ♦ కన్నగాఁడు
రేద్రిమ్మరీఁడు ము ♦ ల్లియవిప్పు లోవాఁడి
కాఁడు తెక్కలికాఁడు ♦ కల్లరీఁడు

తే. తవలి మోసరి యనఁ జెల్లు ♦ దస్కరునకుఁ
దొత్తు సాకుఁడు బోనము ♦ కత్తెదాది
విలువరమ్మాఁడు వరవు డిల్ ♦ బిడ్డయనఁగ
దాసికానామధేయముల్ ♦ దనరు సాంబ. 12

టీ. ఎడకాఁడు, కొల్లగాఁడు = కొల్లచేయువాఁడు, ఎడత్రోవకాపరి = నిర్జనమార్గమునందుఁ గాచియుండువాఁడు, గడిదొంగ = ఒళవెఱింగినదొంగ, దోఁపుడుకాఁడు. రూ. దోఁపికాఁడు = పరులసొమ్ము దోఁచువాఁడు, నాఁచు, గజముచ్చు = పెద్దదొంగ, చేవాఁడికాఁడు - చేతిపదును గలవాఁడు. జాజరకాఁడు. రూ. జజ్జరకాఁడు = వంచన సేయువాఁడు, మచ్చరి (ప్రా. మత్సరి), కంటుగలవాఁడు, మునిముచ్చు=పశ్యతోహరుఁడు. చూచుచుండఁగనే మార్చి కొట్టుకొనిపోవువాఁడు, మాయదారి = మోసముగలవాఁడు. తెరువాటుకాఁడు = దారినడ్డగించువాఁడు. కత్తెరదొంగ = కత్తెరతోఁబనిచేయుదొంగ, దొరకోలుసన్న్యాసి = నమ్మించిమోసపుచ్చిదొంగలించుదొంగ, వడికాఁడు = చుఱుకుఁదనముగలవాఁడు, కన్నగాఁడు = కన్న

ము వేయువాఁడు, రేద్రిమ్మరీఁడు = రాత్రులయందు సంచరించువాఁడు, ముల్లియవిప్పు = ధనములముడులను విప్పువాఁడు, లోవాఁడు=మనమునఁ గఠినత్వముగలవాఁడు, తెక్కలికాఁడు = దొంగతనము గలవాఁడు, కల్లరీఁడు (కల్ల + అరి + ఈఁడు. స్వార్థమున నీ ప్రత్యయము) = బొంకులాఁడు వాఁడు, తవళి, మోసరి (మోసము + అరి) మోసము గలవాఁడు ౨౨ దొంగ, తొత్తు, సాఁకుడు, బోనముకత్తె, (వంటచేయునది), దాది (ప్ర. ధాత్రి), విలువరమ్మఁడు + కూలికిఁ బనిచేయునది, వరవుడు, ఇల్ బిడ్డ ౮ దాసి - పనికత్తె.

సీ. పడపు జాన గడించు ♦ పడఁతి మేల్దాపరి
బోగపుఁజేడియ ♦ పొత్తుటాలు
వేడుకచెలి లంజె ♦ వెలయాలు రోచల్వ
వెల్లాటకత్తె నా ♦ వేశ్య వెలయుఁ
గూర్చియిచ్చుమిటారి ♦ కుంటెనకత్తియు
తాపికత్తె యనంగఁ ♦ దనరు దూతి
నాగవాసం బన ♦ నామమౌ వేశ్యల
మేళంబునకుఁ గొమ ♦ రాలు కొమిరె

తే. చామ జవరాలు కొమరిత ♦ జవ్వని యన
సుందరికిఁ జెల్లు గట్టివె ♦ సుదియుఁ బోటి
యనఁగ దగుఁ బ్రౌఢ ♦ వయసు చెల్లినది ముసలి
మిండకోరన లోలాక్షి ♦ మెఱయు సాంబ. 13

టీ. పడపుఁజాన (పడపు + చాన) = ధనసంపాదనచేయునట్టి స్త్రీ, గడించుపడఁతి = ధనమునుగూర్చుకాంత, మేల్దాపరి=మోహమునుజూపనిది లాభమునఁ దాచునది, బోగపుజేఁడియ (బోగము + చేడియ) సుఖానుభవమునకైనట్టి మగువ, పొత్తుటాలు (పొత్తు + ఆలు) = అనురాగము

జూపు పెండ్లము. వేడుకచెలి = సంతోషముగలిగించు సుందరి, లంజె, వెలయాలు (వెల + ఆలు) = విలువకువచ్చెడి పెండ్లాము, గో చెల్వ=డబ్బునకువచ్చుభార్య, వెల్లాటకత్తె. పా. పెల్లాటకత్తె = మిగులనాట్యముచేయునట్టిది ౧౧ వేశ్య. కూర్చియిచ్చుమిటారి = విటునిజేర్చునది, కుంటెనకత్తియ తాపికత్తె ౩ దూతిక. నాగవాసము, ౧ వేశ్యలసమూహము. కొమరాలు, కొమిరె = పిన్నవయసుది, చామ, జవరాలు = యౌవనముగలది, కొమరిత, రూ. కొమారిత. కొమార్తె, జవ్వని (జవ్వనము + ఇ) = యౌవనముగలది= ప్రాయముగల పడుచు, గట్టివైసుది, ప్రోడ (ప్ర. ప్రౌఢ)౨ ప్రౌఢాంగన-౩౦ యేండ్లకు హెచ్చుతక్కువ వయసుగలది. వయసు చెల్లినది. ముసలి, మిండకోర. రూ. ముండలకోర -౩ ను ౫౦ ఏండ్లకుఁ బయిపడినను విటులను గోరునట్టి స్త్రీ - లోలస్త్రీ.

సీ. కన్నియ కన్నెనా ♦ కన్యక కగుఁ బేరు
లాస గలది అంకు ♦ లాడి చెడిపె
వెలిచోరవరి యన ♦ వెలయు జారిణిపేళ్ళు
మెయి మేయి యొడలు నె ♦ మ్మేను మేను
బొందిి మేమై యనఁ ♦ బొసఁగు దేహమునకు
నెఱికలు వెంద్రుకల్ ♦ నెఱు లనంగఁ
గేశ సమాఖ్యలౌఁ ♦ గేశ బంధముపేళ్ళు
కీల్ముడి క్రొమ్ముడి ♦ కీలుగంటు

తే. నూనెముడి వెన్ను గంటన ♦ నొనరు శిఖకు
జుట్టు సిక సిగ యనఁ జెల్లుఁ ♦ జుంచు కురులు
ముంగురులు కూఁకటు లనంగ ♦ బొసఁగుచుండుఁ
గుంతలమునకు జితదైత్య ♦ కూట సాంబ. 14

టీ. కన్నియ, కన్నె - ౧ కన్యక. ఆసగలది = ఇతరులపై యాశ గలది, అంకులాడి, చెడిపె, వెలిచూరవరి=బయటిరుచిగన్నది.౪ జారిణీస్త్రీ. మెయి, మేయి, ఒడలు, నెమ్మేను, మేను, బొంది, మే, మై. ౮ శరీరము. నెఱకలు, వెండ్రుకలు, నెఱులు - ౩ కేశములు. కీల్ముడి, కొమ్ముడి (క్రొత్త + ముడి.) కీలుగంటు, నూనెముడి. వెన్నుగంటు+వీపునంటునది, ౨ కేశబంధము - జాఱుగముడిచినముడి) జుట్టు, సిగ, సిక-ప్ర. శిఖ౩ జుట్టు ముడి. చుంచుకురులు, ముంగురులు (మున్ను + కురులు) =ముందటి వెండ్రుకలు, కూఁకటులు - ౩ చూర్ణకుంతలములు) - పొడివెండ్రుకలు.

సీ. కొప్పు వేనలి మూాల ♦ క్రొవ్వెద తుఱు మనఁ
గబరి యా కన్ గను ♦ కన్ను నంగ
నేత్రాఖ్యలగు నొసల్ ♦ నెన్నొసల్ నుదురు నె
న్నుదు రన నిట లాఖ్య ♦ లాదవుఁ జూడ్కి
పారువ దిస్టి చూ ♦ పన వీక్షణము లొప్పు
వీనులు చెవులును ♦ జానుగులును
నా నొప్పు శ్రోత్రముల్ ♦ కాను లేఁగాను నె
న్నడుము నడు మనంగ ♦ నడరు మధ్య

తే. మునకుఁ బొక్కిలి బొడ్డనఁ దనరు నాభి
మూతి మోర మొకము మోము ♦ మొగమనంగ
వదనము దనర్చు వా నోరు ♦ వాయిఁ యనఁగ
ముఖగుహాభిఖ్య లగు గురు ♦ మూర్తి సాంబ. 15

టీ. కొప్పు వేనలి,మూాల, క్రొవ్వెద (క్రొత్త + వెద,) తుఱుము ౨ స్త్రీలకొప్పు, కన్, కన్ను-౩ నేత్రము, నొసలు, నెన్నొసలు. నుదురు. నెన్నుదురు. ౪ ఫాలము. చూడ్కి,చూ. చూడికి, పారువ (ద్రావిడము,) దిస్టి, చూపు-౨ వీక్షించుట - వీనులు, చెవులు, జానుగులు - ౩ శ్రోత్ర

ములు. కౌను, లేఁగౌను (లేత + కౌను), నెన్నడుము (నెఱ + నడుము)- నడుము. ౪ మధ్యము, పొక్కిలి బొడ్డు - ౨ నాభి. మూతి, మోర మొకము, మోము, మొగము (ఈ 3 ను ముఖశబ్దభవములు) ౫ వదనము. వా, నోరు వాయి. 3 వదనగుహ (నోరు.)

సీ. పలు పల్లుపండులు ♦ పండ్లన రదము లౌఁ
జెంప దవుడ చెక్కు ♦ చెక్కిలనఁగఁ
దగుఁ గపోలము నెత్తి ♦ తల యన శిర మొప్పు
ముక్కు ముక్కనఁగ నా ♦ సిక చెలంగు
బొమకనుబొమయన ♦ భ్రూనామ మమరు మీ
సలు మీసములనంగ ♦ శ్మశ్రు వలరు
వదరము కెమ్మోవి ♦ పెదవి వాతెఱ మోవి
యన నోష్ఠ మగు నెద ♦ యక్కు ఱొమ్ము

తే. నెడఁద యన వక్ష మగుఁ బొట్ట ♦ కడుపు బొజ్జ
బొజ్జ డొక్కన నుదరంబు ♦ పొసఁగుచుండుఁ
గేలు కైకయి చేయి కెం ♦ గేలనంగఁ
బంచశాఖకు నామముల్ ♦ పరఁగు సాంబ. 16

టీ. పలు, పల్లు, పండులు, పండ్లు - ౪ దంతములు. చెంప. రూ - చెంప, దవుడ, రూ: దౌడ, చెక్కు, చెక్కిలి-౪ కపోలము. నెత్తి, తల,-౨శిరస్సు. ముకు, ముక్కు-౨ ఘ్రాణము. బొమ, కనుబొమ-౨భ్రూరేఖ. మీసలు(మీసము + లు - మువర్ణలోపము.)మీసములు రూ. మీసాలు-౪ శ్మశ్రువులు. అదరము (ప్ర. అధరము.) కెమ్మోవి (కెంపు+మోవి), పెదవి, వాతెఱ = (వాయి+తెఱ) షాష్ఠితాదిసమాసము.) నోటికి గంధమును మూయునది, మోవి - ౫ ఓష్ఠము. ఎద, అక్కు, ఱొమ్ము

ఎడఁద - ౪ ను హృదయము. పొట్ట, కడుపు, బొఱ్ఱ, బొజ్జ, డొక్క - ౫ ఉదరము, కేలు, (నిత్యైకవచనాంతము). కై, కయి, చేయి, రూ. చెయ్యి, చేయి, చే. కెంగేలు (కెంపు + కేలు)—౮ కరము.

సీ. అఱచెయ్యి లోచెయి ♦ యనఁ గరతల మొప్పఁ
పెడచెయ్యి మీఁజెయ్యి ♦ వెనుకచెయ్యి
యనఁ దగు, జరమళ ♦ యంబు వేల్ వ్రేలన
నంగుళి యగుఁ జర ♦ మాంగమునకు
వెన్ను వెనుకమేను ♦ వీపన వర్తిల్లు
గద్దువగడ్డము ♦ గౌద యనఁగఁ
జిబుకనామంబు రా ♦ జిల్లుఁ గడవసంబు
చట్టతో లనఁ గళా ♦ సంబు నాఁగఁ
తే. జన్నుమమరు మోఁకాళ్ళన ♦ జానువు లగుఁ
బిక్క చిఱుదొడ యన జంఘ ♦ పేర్లుదనరు
గురువుతొడయన నూరువు ♦ వరలు ముడ్డి
పిఱుఁదు తుం టన జఘనంబు ♦ పేళ్ళు సాంబ 17

టీ. అఱచెయ్యి, లోచెయి -౨ చేతిలోభాగము, పెడచెయ్యి, మీఁజెయి [మీఁదు + చెయ్యి], వెనుక చెయ్యి = చేతి వెనుకటి భాగము - ౩ చేతి వెనుకటిభాగము. వేలు, వ్రేలు - ౨ అంగుళి. వెన్ను, వెనుకమేను, వీఁపు - ౩ పృష్ఠము. గద్దువ, గడ్డము, గౌద, రూ. గవుద - ౩ గడ్డము. కడవసంబు, చట్ట, తోలు, కళాసము - ౪ చర్మము. మోఁకాళ్ళు - ౧ జానువు, పిక్క. చిఱుదొడ = చిన్నతొడ - ౨ పిక్క. కుఱువు, తొడఁ - ౨ ఊరువు. ముడ్డి, రూ. మూడి. పిఱుఁదు, తుంటి - ౩ కటిభాగము.

సీ. పునుక పుఱియ పుచ్చె ♦ యనఁ గపాలం బొప్పు
బుజము మూఁపన ♦ జెల్లుఁ భుజము పేర్లు

బట్టవలువ కోక ♦ పుట్టంబు గింటెంబు
చీర నావసనంబు ♦ చెలఁగు నఱుత
గొంతు కుత్తుక యఱ్ఱు ♦ కొలిమి మెడ యనంగ
గళమున కగుఁ బిడి ♦ కిలన ముష్టి
కగుఁ బ్రసృతికిఁ జేర ♦ యన నంజలికి దోయి
లనహస్తమునకు మూ ♦ రనఁగఁ బొసఁగు

తే. బారయనఁగను వ్యామాఖ్య ♦ పరఁగు జేన
దుత్తయనఁ దాలమున కొప్పు ♦ బెత్తయనఁగ
నంగుళాభిఖ్య యగు నంజ ♦ హజ్జయడుగు
నాఁగఁ బాదాఖ్యలగు లోక ♦ నాథ సాంబ. 18

టీ. పుసుక. రూ. పుస్క. పుణీయ. రూ. పుఱ్ఱె, పుచ్చె - ౩ కపాళము. బుజము, మూఁపు, - ౨ బాహువు. బట్ట, వలువ, కోక, పుట్టము, గింటెము, చీరె ౬ వస్త్రము, అఱుత, గొంతు, కుత్తుక, అఱ్ఱు, కొలిమి, మెడ—౬ కంఠము, పిడికిలి-౧ముష్టి. చేర ౧ ప్రకృతి [చాచినవేళ్లు గల యఱచేయి.) దోయిలి. రూ. దోసిలి - ౨ అంజలి. మూర- ౧ [మోచెయ్యి మొదలు వేళ్ళకొనవఱకుండు భాగము.] బార - ౧ వ్యామము [రెండు చేతులు చాఁచిననడుమనుండుసందు] జేన, దుత్త - ౨ తాలము [చాచిన బొటనవ్రేలికొనకు చిటికెనవ్రేలికిని నడుమనుండు సందు] బెత్త-౧ అంగుళము, అంజ, హజ్జ, రూ. అజ్జ, అడుగు - ౩ పాదము.

సీ. చనులు గుబ్బలు చండ్లు ♦ చాచులు పాలిండ్లు
చన్ను లనంగఁ గు ♦ చంబు లమరు
నారు నూగారన ♦ నలరు రోమావళి
పాపలఁ గనుతావు ♦ పత్తబుయ్య

మరునిల్లు దుబ్బన ♦ మదన మందిర మొప్పఁ
బిల్లలఁ గలిగించు ♦ వేరు చుల్లి
బుల్లబెల్లమనంగఁ ♦ బొసగు శేఫముగాఁడు
గుద్ద పిఱ్ఱి యనంగ ♦ గుదము దనరుఁ
తే. పైఁట పయ్యాఁద ♦ పయఁట చెఱఁగు
నాఁగఁ జేలాంచలాభిధా ♦ నంబు చెలఁగుఁ
గలువడము చందువా మేలు ♦ కట్టనంగ
నతిశయిల్లు వితానాహ్వ ♦ యములు సాంబ. 19

టీ. చనులు, గుబ్బలు, చండ్లు, చాచులు, పొలిండ్లు, చన్నులు-౬. స్తనములు. ఆరు. నూఁగారు-౧ నాభిక్రింది రోమరేఖ, పాపలఁగనుతావు=బిడ్డలనుగనునట్టితావు, పత్త, బుయ్య, మరునిల్లు, దుబ్బ - ౫ మన్మథాగారము (స్త్రీలింగము). పిల్లలఁ గలిగించువేరు=బిడ్డలఁబుట్టించుటకు మూలమైనది, చుల్లి, రూ. చుల్ల, బుల్ల, బెల్లము-౫ పుంలింగము. గాఁడు, గుద్ద పిఱ్ఱి - ౩ అపానస్థానము. పైఁట, పయ్యాఁట, పయ్యెద, రూ. పయ్యద, పయఁట, చెఱఁగు - ౬ చీరకొంగు. కలువడము, చందువా, మేలుకట్టు - ౩ వితానము (వివాహాదులందుఁ బందిటికిఁజేయు వస్త్రాలంకారము.) (చాందినీ.)

సీ. చెలిముద్దుగుమ్మ యు ♦ గ్మలి నవలా చాన
కన్నెబిత్తరి గోతి ♦ కలికి మగువ
జవరాలు చేడియ ♦ జవ్వని తొయ్యలి
నాతి పైదలి యెల ♦ నాగ లేమ
సకియ జక్కవచంటి ♦ చామ చిల్కలకొల్కి
గుబ్బెత ప్రోయాలు ♦ కొమ్మ పడఁతి

పొలతి ముద్దియ నన ♦ బోఁడి యింతి మిటారి
నెలఁతుక వాల్గంటి ♦ నెలఁత తెఱవ
తే. యన్ను లతకూన యొయ్యారి ♦ యతివ వెలఁది
చెలియ సకి బోటి కొమరిత ♦ చిగురు బోఁడి
ముగుద వగలాఁడి సింగారి ♦ ముదిత యువిద
గరిత యన భామినీ సమా ♦ ఖ్యలగు సాంబ. 20

టీ. చెలి, ముద్దుగుమ్మ=ముద్దులు గులుకునది, ఉగ్మలి. నవలా చాన, కన్నె, చిత్తరి, గోతి, కలికి, మగువ, జవరాలు. చేడియ, జవ్వని, తొయ్యలి, నాతి, పైదలి, ఎలనాగ, లేమ, సకియ, జక్కవచంటి = చక్రవాకపక్షులమాడ్కి నొండొంటిఁ గదిసియుండు స్తనములుగలది. చామ, చిలుకల కొలికి=చిలుకలఁకొలుకులవంటి కంటికొనలుగలది. గుబ్బెత=గుబ్బచన్నులుగలది, ప్రోయాలు, కొమ్మ, పడఁతి, పొలఁతి, ముద్దియ,ననబోఁడి=పుష్పముంబోలు మేనుగలది, ఇంతి, మిటారి; మిటారముగలది, నెలఁతుక, వాల్గంటి=(వాలు + కంటి,) నిడుపుకన్నులు గలది, నెలఁత, తెఱవ, అన్ను, లతకూన=లేఁతతీఁగెను బోలినది, ఒయ్యారి = ఒయ్యారముగలది, అతివ, వెలఁది. రూ. వెలఁదుక, చెలియ, సకి (ప్ర. సఖి), బోటి, కొమరిత, చిగురుఁబోఁడి=చిగురువంటి మేనుగలది, ముగుద ప్ర. ముగ్ధ. వగలాఁడి=వగలుగలది, సింగారి=సొగసుగలది, ముదిత, ఉవిద, గరిత—ఇవి స్త్రీ.

సీ. ఆనవాలును వులు ♦ గంగమచ్చము గుఱు
తడియాల మన లాంఛ ♦ నాఖ్యలొదవు
జడితి గొబ్బున వేగ ♦ సరగు గ్రక్కున వడి
వేగిర మనఁ దగు ♦ వేగమునకు
మరియాద గడి మేర ♦ సరుదెల్ల కర యనఁ
బఱఁగు మర్యాదకు ♦ వెఱఁగు వింత

యక్కజ మబ్బుర ♦ మరిది నివ్వెఱ యబ్ర
మచ్చెరు వన నద్భు ♦ తాఖ్య లమరుఁ
తే. బరఁగు కదలిక పరువన ♦ మెఱయుధావ
నమ్మునకు వేడెమొనరించె ♦ గ్రమ్మెఁ బొదివెఁ
జుట్టుకొనె నావరించె నా ♦ నిట్టినుడులు
వేష్టనంబున కమరు సర్వేశ సాంబ. 21

టీ. ఆనవాలు, పులుఱు, అంగమచ్చము, గురుతు, అడియాలము-౫ చిహ్నము, జడితి (పఠి. ఝడితి), గొబ్బునఁ, వేగ, సరగు, గ్రక్కునఁ …గతి, వేగిరము - ౭ శీఘ్రము, మరియాద, గడి, మేర, సరుదు, ఎల్ల, కర, – హద్దు. వెఱఁగు, వింత అక్కజము, అబ్బురము, అరిది, నివ్వెఱ (నిండు + వెఱ), అబ్రము, అచ్చెరువు (పఠి. ఆశ్చర్యము.) - ౮ ఆశ్చర్యము, పరుగు, కదలిక, పరువు-౩ పరుగెత్తుట. వేడెమొనరించె, క్రమ్మె, పొదివె, చుట్టుకొనె, ఆవరించె - ౫ చుట్టును గూర్చుండియుండె.

సీ. బువ్వ మెతుకు కూడు ♦ బోన మోరెము పసా
దము వంటకము పస ♦ దనము బాతు
సాద మోగిర మన ♦ జరుగు నన్నము పేళ్ళు
కుడిచె బోసేసె సా ♦ పడియె నమలె
నారోగిణ మొనర్చె ♦ నారగించె మెసవెఁ
దినె మెక్కె నన భుక్తి ♦ గొనుట కలరుఁ
బనులు చెయ్యులు సేత ♦ లనఁ గర్మముల కొప్పుఁ
గనలు మోడి యలుక ♦ కినుక కిన్క

తే. నాఁగఁ గోపాఖ్యలగు లజ్జ ♦ నాన సిగ్గు
జొనుకుఁ బుయిలోట సిబ్బితి ♦ పుచ్చటి కన

బరఁగు వ్రీడాఖ్య యొాల నెంపంబు సాక
నంగ వ్యాజం బమరు జగన్నాథ సాంబ. 22

టీ. బువ్వ, మెతుకు, కూడు, బోనము, ఓరెము, పసాదము (ప్రి- ప్రసాదము) వంటకము, పసదనము, బొతు, (అన్యదేశ్యము) సాదము (ఇది ద్రావిడపదము.) ఓగిరము - ౧౧ అన్నము. కుడిచె, బోసెసె, సాపడియె, నమలె, అరోగిణమొనర్చె. రూ. ఆరోగణమొనర్చె, ఆరగించె, మెసవె, తినె, మెక్కె - ౧౦ భోజనముచేసెను. పనులు, చెయ్వులు, చేఁతలు - ౩ కార్యములు, కనలు, మోడి, అలుక, కినుక, కిన్క - ౫ కోపము, లజ్జ, నాన, సిగ్గు, బొనుకు, పుయిలోట, సిబ్బితి, పుచ్చటిక, రూ. పుచ్చడిక - ౪ సిగ్గు, ఓల, నెపము (ప్రి. నిభము.) సాకు - ౩ మిష.

సీ. పానుపు తలిమంబు • పఱుపు లే పన మెత్త
సెజ్జ యనఁగ శయ్య ♦ చెలఁగుచుండుఁ
బన్నుండెఁ దెన్నుండెఁ ♦ బండుకొనెఁ బరుండె
బవ్వళించెను బండెఁ ♦ బడకసేసె
నత్తమిల్లె ననంగ ♦ నలరారు శయనించె
ననుటకు నిద్దుర ♦ గూనియె గుఱక
గూనియె నిద్దురవోయెఁ ♦ గూర్కెడె నన నిద్రి
తునకొప్పులేచె మే ♦ ల్కొనియె మేలుఁకు

తే. వమ్యె నన జాగ్రదభిధాన ♦ మమరు వేడ్క
యెలమి వేడుక సంతోస ♦ మింపు ముదము
పంతసము సొంపు మే లరు ♦ సంబనంగఁ
బ్రమదమున కాఖ్యలగు జగ ♦ త్ప్రాల సాంబ. 23

టీ. పానుపు, రూ. పాన్పు, తలిమము, పఱుపు, లేపు, మెత్త, సెజ్జ (ప్ర. శయ్య) ౭ శయ్య. పన్నుండెను, తెన్నుండెను, పా. తొన్నుండెను. పండుకొనెను, పరుండెను, పవ్వళించెను, పండెను, పడకవేసెను. అత్తమిల్లెను- ౧ శయనించె. నిద్దురగొనియె, గుఱకగొనియె, నిద్దురవోయె కూర్కెడెను. ౪ నిద్రించెను, లేచె, మేల్కొనియె, మెలఁకువయ్యె ౭ నిద్ర లేచెను, వేడ్క, ఎలమి, వేడుక, సంతోసము. వి. సంతోషము. ఇంపు, ముదము, సంతసము, సొంపు, మేలు, అరుసంబు - ప్ర హర్షము ౧౦ సంతోషము.

సీ. పలికె వాక్రుచ్చె ♦ నప్పనసేసె మందలిం
చెను విన్నవించెఁ జె ♦ ప్పెనని నొడివె
నాడెఁ బల్కెవచించె ♦ ననభాషణము సేసె
ననుట కొ వీనిచ్చె ♦ నాలకించె
వినెఁ జెవియొగ్గెను ♦ వినియె నాలించె నా
కర్ణితమయ్యె ననుట కొఁ ♦ జులుక చొక
యులక యెల్లిద మన ♦ నొనరు లఘుత పేళ్ళు
పులకలొత్తెను గగు ♦ ర్పొడిచె గగురు
తే. పాటె గరుపాటె మైమోజు ♦ పర్వెననఁగఁ
దగును రోమాంచనామముల్ ♦ నగవు నవ్వు
నగు నవన హాసమున కొప్పు ♦ నడిమిదిన్నె
దీవి యన ద్వీప మగుఁ బర ♦ దేవ సాంబ 24

టీ. పలికెను, వాక్రుచ్చెను, అప్పనసేసె (ప్ర. అర్పణచేసెను), మందలించెను, విన్నవించెను, చెప్పెను, అనెను, నొడివెను, ఆడెను, పల్కెను, వచించెను-౧౧ మాటలాడెను. వీనిచ్చె. ఆలకించె, వినె, చెవియొగ్గె, వినియె, ఆలించె - ౬ వినెను. చులుక. రూ: చుల్క, చొక, రూ. చవుక, ఉలక, ఎల్లిదము-౬లఘుత్వము, పులకలొత్తెను, గగుర్పొడిచె. రూ. గగురువొడిచె,గగ్గురుపొడిచె. గగురుపాటె, గరుపాటె మైమోజుపర్వె-౭రోమాం

చము గలిగెను. నగవు, నవ్వు, నగు, నవు - ౪ హాసము, నడిమిది నె
ఱీవి ౧ ద్వీపము.

సీ. జోత జాగిల కొల్పు ♦ జోహారు గిడిగిడి
మోడుపు చేకూర్పు ♦ మ్రొక్కు మొగుపు
చిన్న పూచేమోడ్పు ♦ జేజె వెన్నెలచెంగ
నాలు గొబ్బులు టెంక ♦ ణాలు నేరె
డల్లుల్ సలా మన ♦ నమరు దండము పేళ్ళు
పళ్ళెము కంచము ♦ పళ్ళెరంబు
తెలె హరివాణంబు ♦ తలియ తట్టియనంగ
భాజనం బగు గిన్నె ♦ బటుదికోర

తే. డబ్బర యనంగఁ జషక మా ♦ డప్పి దూప
దప్పి దగ నీరువట్టన ♦ దాహ మమరుఁ
జాగ మీవి ఫుడుకు పెట్టు ♦ తేగ మీగి
యనఁగ ద్యాగసమాభిక్య ♦ లగును సాంబ. 25

టీ. జోత. రూ. జోతము, జాగిలి, కొల్పు, జోహారు. రూ. జోహా
రువు - జొహారు-జొహారువు, గిడిగిడి, మోడుపు. రూ. మోడ్పు, చేకూ
ర్పు, మ్రొక్కు, మొగుపు, చిన్నపూ, చేకూర్పు, జేజె, వెన్నెల, చెంగనా
లు, దొబ్బులు, టెంకణాలు, నేరెడల్లులు. సలాము (ఇది యన్యదేశ్యము).
౨౭ నమస్కారము, పళ్ళెము రూ. పళ్యము: కంచము, పళ్లెరము, తెలె,
రూ. తెలియ, హరివాణము, తలియ, తట్టి 9 పాత్రము. గిన్నె, బటుదు,
కోర, డబ్బర రూ. దబ్బర-౫ గ్రాగుగిన్నె, డప్పి, దూప, దప్పి, నీరు
వట్టు-౪ దాహము. చాగము, ఈవి, ఫుడుకు; పెట్టు, తేగము, ఈగి, రూ-
ఈవి-౯ త్యాగము.

సీ అగపడె జేపడె • నబ్బె దొరకెఁ జిక్కెఁ
దగిలెఁ దగుల్కొనెఁ • దగులువడియెఁ
బట్టువడియెఁ జిక్కు • వడెఁ దవిలె ననంగ
నమరు గృహీతాఖ్య • లఱచె నేడ్చె
వాపోయె మొఱలిడె • వాచఱచె ననంగ
రోదనంబున కగు • రొద గలిబిలి
చప్పుడు గొలగొల సద్దు • కూఁత యులివు
నలుకుడు రవళి అం • తనఁగ ధ్వనికి

తే. నలరుఁ గలసెఁ బెరసెఁ గూడె • హత్తె దొరసె
నందెఁ బొందెఁ బెనఁగెఁ జెందె • నంటె ననఁగ
నమరు సక్తాఖ్య లొనయ్యె • నగ్గమయ్యె
లోపడె ననంగ స్వవశాఖ్య • లుచను సాంబ 26

టీ. అగపడెను (అగ్గము + పడెను,) చేపడెను, అబ్బెను, దొరకెను, చిక్కెను, తగిలెను, తగుల్కొనెన్, తగులువడియెను, పట్టువడియెను, చిక్కువడెను, తవిలెను, ౧౧ చేతఁ జిక్కెను. అఱచెను, ఏడ్చెను, వాపోయెను, మొఱలిడెను, వాచఱచెను ౧౨ రోదనముచేసెను, రొద, గలిబిలి, చప్పుడు] గొలగొల, సద్దు, కూఁత, ఉలివు, అలుకుడు, రవళి, అంతు - ౧౦ శబ్దము. కలసెను, పెరసెన్, కూడెన్, హత్తెన్, దొరసెన్, అందెన్, పొందెన్, పెనఁగెన్, చెందెన్, అంటెన్ - ౧౦ చేరుకొనెను, లొనయ్యెన్, అగ్గమయ్యె. లోపడెను - 3 స్వాధీనమాయెను.

సీ. ఎడసె వీడెను బాసె • నెడఁబాసెఁ బురివిచ్చె
వేఱువడె ననంగ వెలయుచుండుఁ

బ్రత్యేకమయ్యె నవన్ • పలుకులు వెడలించె
వెళ్ళగొట్టెను దోలె • వెలలఁ బన్నెఁ
దఱిమె రొప్పెననంగఁ • దనరు నుచ్చాటనం
బొనరించె ననుటకుఁ • గనియెఁ జూచెఁ
గనుఁగొనెఁ దిలకించెఁ • గనెఁ గాంచె ననఁ జెల్లు
దర్శించె ననుటకుఁ • దాల్చెఁ బూనె

తే. నానె మోచె ననఁగఁ జెల్లు • నధివహించె
ననుట కరికట్టె బోనీక • యంకెచేసె
నాఁగె నిల్పెఁ దటాయించె • నడ్డగించె
నానుకొనె ననఁదగు వార • ణాఖ్యసాంబ. 27

టీ. ఎడసెను, వీడెను, పాసెను, ఎడబాసెను, పురివిచ్చెను, వేఱు పడెను, ౬ ప్రత్యేకమాయెను. వెడలించెను, వెళ్లగొట్టెను, తోలెను, వెలల బన్నెను, తఱిమెను, రొప్పెను ౬ తఱుమగొట్టెను. కనియెన్, చూచెన్ కనుఁగొనెన్, తిలకించెన్, కనెన్, కాంచెన్, - ౬ వీక్షించెను. తాల్చెను, పూనెను, ఆనెను, మోచెను,- ౪ ధరించెను. అరికట్టెను. = చుట్టునిలిచెను. పోనీక యంకె చేసెను, ఆఁగెను. నిల్పెను, తటాయించెను, అడ్డగించెను, అనుకొనెను - ౭ నివారించెను, నిగ్రోధించెను.

సీ. అంటుగైకొనియె ము • ట్టయ్యెఁ జెఱఁగుమాసెఁ
గడకేఁగె నింటికిఁ • గాకపోయె
ననఁగ దూరస్థకుఁ • దనరుఁ దానముచేసె
నీళ్ళు పోసికొనె ము • నింగెఁ గ్రుంకె
నన నిమజ్జనమయ్యె • ననుటకుఁ దగు మడి
మడుఁగు మడు వనంగ • నడరు శుచికి

మైల కట్టువిడుపు ♦ మాపన మలినాఖ్య
లగుఁ దల్పువాకిలి ♦ యనఁ గవాట
తే. మునకొనరు నేకతంబు మం ♦ తన మనంగ
నంతరంగమునకుఁ జెల్లు ♦ నక్కఱ పని
యొంజలియు జోలి యనఁ గార్య ♦ మొనరు గంజి
వార్పన యవాగునామముల్ ♦ వఱలు సాంబ.   28

టీ. అంటుగైకొనియె = మలిన భావము నొందెను. ముట్టయ్యెన్, చెఱఁగుమాసెన్, కడకేగెన్, ఇంటికిగాక పోయెన్ - ౫ బహిష్ఠయాయెను. తానముచేసెను. [తానము-ప్ర. స్నానము.] నీళ్ళుపోసికొనెను, మునింగెను, [మునుంకెను - ౪ స్నాన మొనర్చెను. మడి, మడువు, మడుఁగు - ౩ పరిశుద్ధి [మడుఁగుదోవతి] మైల. రూ. మయిల. కట్టువిడుపు, మాపు - ౩ మైల. [మైలగుడ్డ] తల్పు. రూ. తలుపు, వాకిలి - ౩ కవాటము. ఏకతము, మంతనము - ౨ ఏకాంతస్థలము. అక్కఱ, పని, ఒంజలి, జోలి - ౪ కార్యము గంజ వార్పు - ౨ యవాగువు.

సీ. ఒకటి యొక్కఁడొకండు ♦ నొండన నేకాఖ్య
జమి డిమ్మ డిబ్బడి ♦ జంట రెండు
దుగ రెట్టి దువ యన ♦ ద్విగుణాఖ్య కవ జోడు
దంట దోయి యనంగ ♦ ద్వంద్వసంఖ్య
మూఁడొకటి తిగ ♦ మూఁ డనఁ ద్రయసంజ్ఞ
చౌ యుడ్డ తీవంచ ♦ చౌకము నలు
నాలుగనఁగఁ జతు ♦ ర్నామముల్ చౌవంచ
యరపదియేను నై ♦ దనఁగఁ బంచ
తే. కంబు నాఱు త్తిగ యన ష ♦ ట్కంబు చక్కు
పగడ సత యే డనంగ స ♦ ప్తకము దచ్చి

యెనిమి దన నష్టకము తొమ్మి ♦ దనఁ గ నవము
పదియు నీరైదు దన దశాఖ్య ♦ పరఁగు సాంబ. 29

టీ. ఒకటి, ఒక్కఁడు, ఒకండు. ఒండు-౪ ఏకసంఖ్య. జమిడి రూ. జమిలి, ఇమ్మడి, రూ. ఇనుమడి, ఇబ్బడి, జంట, రెండు, దుగ, రెట్టి దువ - ౧౦ ద్విసంఖ్య. కవ, జోడు, దంట, దోయి - ౪ జత - [మిథునము] ము, రెండొకటి, తిగ, మూఁడు-౪ త్రితయము-త్రిసంఖ్య,] చౌ, ఉడ్డ, తీవంచ, చౌకము, నలు, నాలుఁగు - ౬ చతుష్టయము, చౌవంచ, అరపస - పదిలో సగము ఏను, ఐదు, రూ. అయిదు - ౪ పంచసంఖ్య - పంచకము, ఆఱు, ఇత్తిగ [ఇరు + తిగ] - ౨ షట్సంఖ్య - షట్కము చక్కపగడ. సత, ప్ర. సప్త ఏడు-౩ సప్తసంఖ్య-సప్తకము దచ్చి. ఎనిమిది-౨ అష్టసంఖ్య అష్టకము. తొమ్మిది - ౧ నవసంఖ్య. పది. ఈరైదు రెండు అయిదులు - ౩ దశసంఖ్య-దశకము.

సీ. పదునొకం డనఁగను ♦ బరఁగు నేకాదశం
బీరాఱు పండ్రెండు ♦ బారయనఁగ
రవిసంఖ్య యగు నానెఁ ♦ ద్రాగె ద్రావెను గ్రోలె
ననఁ గ బానముచేసె ♦ ననుట కొనరు
బనివినియెను బోయెఁ ♦ జనె నేఁగె నరిగె నాఁ
గృతగమనునకుఁ బే ♦ ళ్ళెసఁగు గ్రమ్మ
ఱించెఁ ద్రిప్పెను మగి ♦ డించె మరల్చె నా
నావర్తన మొనర్చె ♦ ననుట కొనరుఁ

తే. బాతె వెళ్ళెను పరువెత్తెఁ జఱచెఁ గదలె
నుఱికెఁ దొలఁగె నటమరించె ♦ జరిగె ననఁ బ
లాయితుం డయ్యె ననుటకు ♦ నలరుచుండు
సకలసురచక్రవర్తి శ్రీ ♦ సాంబమూర్తి. 30

టీ. పదునొకండు-౧ ఏకాదశసంఖ్య. ఈరాలు=రెండు ఆఱులు, పండ్రెండు, బార - ౩ ద్వాదశసంఖ్య, ఆనెను, త్రాగెను, క్రోలెను - ౪ పానముచేసెను. పనివినియెను, పోయెను, చనెను, ఏఁగెను, అరిగెను - ౫ వెళ్ళె ననుట కర్థము, క్రమ్మఱించెను, త్రిప్పెను, మగిడించెను, మరల్చెను - ౪ నివృత్తిచేసెను. పాఱెను, వెళ్ళెను, పరుగెత్తెను, పఱచెను, కదలెను, ఉఱికెను, తొలఁగెను, ఆటమరించెను, జరిగెను - ౯ పలాయితుఁడయ్యెను.

సీ. గడుసరి దిట్ట యె ♦ క్కటి వాఁడిగలవాఁడు
వడికాఁడు పోటరి ♦ బంటు మేటి
మనసరి తెంపరి ♦ మొనకాఁడు మిడిమాసి
వడివాఁ డనంగ శూ ♦ రుఁడు సెలంగు
నని చివ్వ యేట్టెజు ♦ యాలము బవరము
పోట్లాట పెనఁకువ ♦ పోరు కలను
కయ్యము దురము జ ♦ గడ మన యుద్ధాఖ్య
లమరుమద్దత్తు వె ♦ న్నాస తోడు
తే. పాటు సావాసము పరాలు ♦ బాసటయన
రాజిలు సహాయమునకు వే ♦ రమ్ము కంటు
సూడు పగ దేస మనఁగఁ బొ ♦ ల్చును విరోధ
నామములు సర్వలోకైక ♦ నాథ సాంబ. 31

టీ. గడుసరి, దిట్ట, ఎక్కటి, వాఁడిగలవాఁడు, వడికాఁడు, పోటరి, బంటు, మేటి, మనసరి, తెంపరి మొనకాఁడు, మిడిమాసి, వడిఫాఁడు - ౧. శూరుఁడు. అని, చివ్వ, ఏట్టెజు, ఆలము, బవరము, పోట్లాట, పెనఁకువ, పోరు, కలను, కయ్యము [ప్రా. కలహము.] దురము, జగడము - ౧౩ యుద్ధము, మద్దత్తు, వెన్నాస, తోడుపాటు, సావాసము, (ప్రా. సహవాసము

పరాలు, బాసట-౬సహాయము. వేరము, (ప్రే. వైరము.) కంటు, సూడు-పగ, దేశము-౨౯ విరోధము.

సీ. నులిచె వెంపరలాడె ♦ నుగ్గాడెఁ దెగటార్చెఁ
    జక్కాడెఁ బగదెంచెఁ ♦ జంపెఁ జెండె
సదమద మొనరించెఁ ♦ జదిపెఁ బీచమడంచె
    నులిమె చాఁగఁబలాడెఁ ♦ బిలుకుమార్చెఁ
బరిమార్చె ముగియించె ♦ నుఱుముసేసె నడంచె
    ద్రుంచెఁ బొగరుమార్చెఁ ♦ దునిమె మడిపె
మన్నిగొనియె రూపు ♦ మాపె గీటడఁగించెఁ
    మడియించెఁ దూలించె ♦ మలిపె ననఁగఁ
తే. బనఁగు వధియించె ననుటకుఁ ♦ బ్రోచెఁ బ్రోవె
    సాఁకెఁ గాపాడె బ్రతికించె ♦ సంతరించెఁ
    బెంచె మనిపె ననఁగను బో ♦ షించుట కగు
    సకలసురచక్రవర్తి శ్రీ ♦ సాంబమూర్తి. 32

టీ. నులిచెన్, వెంపరలాడెన్, నుగ్గాడెన్, తెగటార్చెను, చక్కాడెను, పగదెంచెన్, చంపెన్, చెండెన్, సదమదమొనరించెను, చదిపెను, పీఁచమడఁచెన్. నులిమెన్, చాఁగఁబలాడెను, పిలుకుమార్చెను, పరిమార్చెను, ముగియించెను, నుఱుముసేసెను, అడంచెను, తుంచెను, పొగరుమార్చెను, తునిమెను, మడిపెను, మన్నిగొనియెను, రూపుమాపెను, గీటడఁచెను, తూలించెను, మలిపెను - ౫౯ సంహరించెను. ప్రోచెను, ప్రోవెను, సాఁకెన్, కాపాడెను, బ్రతికించెన్, సంతరించెన్, పెంచెన్, రూ. పెనిచెన్, మనిపెన్, రూ. మనిచెన్, మంచెన్-౧౧ రక్షణ మొనర్చెను.

సీ. ఇచ్చ తలఁపు మది ♦ యెద మనసనఁ జిత్త
    మగు దమకము మేలు ♦ మరులు బాళి

తమి వలపు విరాళి ♦ మమత నా మోహ మా
నాఁడాది యదిమత ♦ నాఁటనుండి
తలనాఁడు నాఁడు మొ ♦ దలునాఁటఁబట్టి యా
నాఁడున్కి యనిమొదల్ ♦ నాఁటఁగోలె
యనఁగ దదారభ్య ♦ యనుట కౌ మంచి మేల్
బాగు లెస్స యన శు ♦ భంబు లలరు

తే. వనట యంగలారుపు వెత ♦ వంత గోడు
బాద యంగద వగ పనఁ ♦ బరఁగుఁ బీడ
పదవి సిరి కల్మి యనఁగ సం ♦ పదకు వెలయు
నితము పేరి మింపన హిత ♦ మొసఁగు సాంబ. 33

టీ. ఇచ్చ, తలఁపు, మది, ఎద, మనసు (ఇది తత్సమముగానున్నది) ౫ మనస్సు, తమకము, మేలు, మరులు, బాళి, తమి, వలపు, విరాళి, మమత (ఇది తత్సమము.)-౧ మోహము, నాఁడాది, అదిమత - నాఁటనుండి, తలనాఁడు, నాఁడుమొదలు, నాఁటఁబట్టి, ఆనాఁడున్కి, అదిమొదలు, నాఁటగోలె - ౮ ఆదినము మొదలుకొని. మంచి, మేలు, బాగు, లెస్స - ౪ శుభము, వనట, అంగలారుపు, వెత, వంత, గోడు, బాద (ప్రి. భాధ), అంగద, వగపు - ౮ పీడ-నొప్పి, పదవి (తత్సమము), సిరి, కల్మి, రూ. కలిమి-౩ సంపద, ఇతము, పేరిమి, ఇంపు-౩ హితము.

సీ. జతపీడె నెడసె నాఁ ♦ జను విరహము పేరు
లెనసెఁ బైకొనెఁ బొందె ♦ నేలెఁ గలసె
నన సంగమ మొనర్చు ♦ ననుట కౌఁ బొలయల్క
వెడమోడి యనఁ బేళ్ళు ♦ వెలయుఁ బ్రణయ

కలహమునకు జడ ♦ గాంజ గంజా బంగి
యనఁగ గలంజాహ్వ ♦ యంబు లలరు
మబ్బు లాహిరికైపు ♦ మస్తన మత్తత
భాసిల్లుఁ దోడుసు నుం ♦ పడ మనంగ

తే. భోగవనితకుఁ దగుఁ దెంపి ♦ ముసుకు కుంక
మాసకమ్మన విధవనా ♦ మములు సెలఁగు
బైరవాసంబు దోవతి ♦ పంచెయనఁగ
నిల బహిర్వసనాభిఖ్య ♦ లలరుసాంబ. 34

టీ. జతలిడెన్. ఎడసెన్ - ౧ వియోగము నొందెను. ఎనసెన్, పైకొనెన్, పొందున్, ఏలెన్, కలసెన్ - ౫ సంగమించెను. పొలయలుక, వెడమోడి - ౨ ప్రణయకలహము జడ, గాంజ, గంజా, బంగి ౫ కలంజము, (గంజాయి) మబ్బు, లాహిరి, కైపు, మస్తు - ౪ మత్తు, తోడుసు, ఉంపడము - ౨ ఉంచుకొన్న స్త్రీ. తెంపి, ముసుకు, కుంక, మాసకమ్మ - ౪ విధవ బైరవాసము, రూ, బయిరవాసము; దోవతి, పంచె - ౩ పయివస్త్రము.

సీ. విచ్చేసె నేతెంచె ♦ వచ్చెను వేంచేసె
నరుదెంచెఁ జనుదెంచె ♦ ననఁగ నాగ
తునిపేరు లగు మగ ♦ తనము మగంటిమి
గం డన బారుషా ♦ ఖ్యలు చెలంగు
గద్దించె నదలించె ♦ గదిమెను నుఱిమె నా
గర్జించె ననుట కా ♦ గట్టి యుక్కు
చేగ యూట యుదుటు చేవయుఱవు బిగు
వన దృఢత్వము పేరు ♦ లలరు జట్టి

తే. విలువరో వెల యనఁ గ్రయా ♦ ఖ్యలు దనర్చుఁ
గప్రము సిరంబు గంబూర ♦ కప్పూర మన
వెలయుఁ జంద్రంబు వెలి గ్రుక్క ♦ గిలుకుపలుకు
రవపలుకనంగ మణితాఖ్య ♦ లవును సాంబ. 35

టీ. విచ్చేసెను, ఏతెంచెను, రూ. ఏగుదెంచెను, వచ్చెను, వేంచేసెను, అరుదెంచెను రూ. అరుగుదెంచెను, చనుదెంచెను - ౨ ఆగతుఁడయ్యె, మగతనము, మగంటిమి, గండు - ౩ పౌరుషము గదించెను, అదలించెను, గదిమెఁ, ఉఱిమెను - ౪ బెదరించెను, గట్టి, ఉక్కు, చేగ, ఊట, ఊదుటు, చేవ, ఉఱవు, బిగువు-౨ దార్ఢ్యము. జట్టి, విలువ, రో, వెల- ౪ మూల్యము-క్రయము, కప్రము. సిరము. గంబూర. రూ. గంబూరము, గంబురము. గంబురా, కప్పూరము, రూ. కపురము - ౨ కర్పూరము. వెలిగుర్రిక్క, గిలుకుపలుకు, రవపలుకు, ౩ సంభోగ ధ్వని.

సీ. లేమి పేదఱికము ♦ లేమిడి లేవడి
నిప్పచ్చర మిడుమ ♦ నెవ్వ యనఁగ
దారిద్ర్యనామముల్ ♦ తగు దెస యాత్రము
కడగండ్లు గోరము ♦ కస్తి బెడఁద
యడలు చేటన విప ♦ దాఖ్యలు వర్తిల్లుఁ
డెక్కెమెగురఁదొట్టె ♦ డింక వేసెఁ
బెద్దనిద్దురవోయె ♦ బిద్దె మడిసెఁ జచ్చెఁ
జనె గంతుకొనెఁ ద్రుంగె ♦ సమసె నేగెఁ

తే. గూలె నీల్గెఁ గెడసెఁ ద్రెళ్ళెఁ ♦ గ్రుంకె బ్రుంగె
దెరలెఁ బోయె ముగిసెఁ దేఁటెఁ ♦ దొరఁగె ననఁగఁ
బరఁగు మృతునిసమాఖ్యలు ♦ బవిరి చుట్టు
వేడె మన వలయాభిధల్ ♦ వెలయు సాంబ. 36

టీ. లేమి=పేదటికము (పేద+టికము-భావార్థకతద్ధితము), లేమిడీ లేవడి, నిప్పచ్చరము, ఇడుమ, సెవ్వ - ౭ దారిద్ర్యము. దెస, ఆతఱిము రూ. అత్తరము, కడగండ్లు (నిత్యబహువచనాంతము) గోరము, కస్తి, బెడద, అడలు, చేటు - ౯ ఆపత్తు. బెక్కు-మెగురఁగొట్టెన్, డింకవేసెన్, పెద్దని స్ఫురవోయెన్, బిద్దెన్, మడిసెన్, చచ్చెన్, చనెన్, గంతుగొనెన్, త్రుంగెన్, సమసెన్, ఏగెన్, కూలెన్, నీల్గెన్, కడసెన్, త్రెళ్ళెన్ క్రుంకెన్, బ్రుంగెన్. తెరలెన్, పోయెన్, ముగిసెన్, తేలెన్, తొరఁగెన్ - ౨౬ మృతిపొందెను. బవిరి, చుట్టు, వేడెము - ౩ వలయము (కాలిచుట్టు).

సీ. గమి పోఁజు మొత్తము ♦ కదుపు చేరువబారు
పిండు కూటువ పరి ♦ దండు దిమ్మ
గుంపు తుటుము గుమి గూటు ♦ పదు వనంగ
బృందాఖ్య యగు వెళ్ళె ♦ వెడలె వెలలె
వెలువడె ననఁ బేళ్ళ ♦ దెలయు నిర్గతుఁ డంట
కెన్నఁడు వాలాయ ♦ మెపుడు నిచ్చ
లెల్లప్పు డెప్పటి ♦ కేప్రొద్దు నెడపకే
నా డెప్పు డుడుగక ♦ నా జెలంగు

తే. సంతతాఖ్య గొలము వంగ ♦ సమ్ము వంగ
డమ్మునఁ గులాఖ్య వర్తిల్లుఁ ♦ గ్రమ్మఱ మఱి
మగుడ వెండియుఁ బలుమఱు ♦ మరల సారె
తిరుగ ననఁ బునరాఖ్యలు ♦ పరఁగు సాంబ. 37

టీ. గమి, పోఁజు, మొత్తము, కదుపుఁ చేరువఁబారు, పిండుకూటువ, పరి, దండు, దిమ్మ, గుంపు, తుటుము, గుమి, కూటు, పదువు - ౧౬ సమూహము. వెళ్ళెన్, వెడలెను. వెలలెన్, వెలువడెన్ - ౪ ప్రయాణ

న్యేను. ఎన్నఁడు, వాలాయము, ఎపుడు, నిచ్చలు, ఎల్లప్పుడు, ఎప్పటికిన్, ఎప్రొద్దును, ఎడపక, ఏనాడు, ఎప్పుడు, ఉడుగక - ౧౧ సతతము. (సదా.) కొలము, ప్ర-కులము, వంగసము, వంగడము, ప్ర. వంశము - 3 వంశము. క్రమ్మఱ, మఱి, మగుడన్, వెండియున్, పలుమఱు, మరల, సారె, తిరుగన్ - ౨ మాటికి మాటికి,

సీ. పంద కోఁచ పిఱికి ♦ పాలుఁబోతనఁగను
సమర భీరుని పేరు ♦ లమరుచుండు
విడియము వీడెంబు ♦ వీడ్యము వక్కాకు
తమలము బాగాలు ♦ తమ్ములంబు
నాఁ జనుఁదాంబూల ♦ నామముల్ కొనియాడె
నగ్గించెఁ బొగడెఁ గొం ♦ డాడె నెంచెఁ
గైవారమొనరించె ♦ నా వినుతికిఁ బేళ్ళు
కాంక్ష కోరిక కోర్కి ♦ యిచ్ఛ యనగ

తే. నిచ్ఛ కగు రోసెఁ బరికించె ♦ నెమకెఁ దడవె
వెదకె నారసె నరసెను ♦ వెతకె ననఁగఁ
దనరు నన్వేష ణాఖ్యలు ♦ తన్నెఁ దాఁచె
నడుగు తాటించెఁ గాళ్ళచే ♦ నడఁచెననఁగ
నమరుఁ బదతాడనాభిధా ♦ నములు సాంబ. 38

టీ. పంద, కోఁచ, పిఱికి, పాలుఁబోతు (పాలు + పోతు)-౪ యుద్ధమునకు వెఱచువాఁడు. విడియము. రూ. వీడెము, విడెము, వీడ్యము, వక్కాకు (వక్కలు + ఆకులు.) తమలము, బాగాలు. తమ్మలము-౭. తాంబూలము. కొనియాడెను, అగ్గించెను, పొగడెను, కొండాడెన్, ఎంచెన్, కైవారమొనరించెన్ - ౬ స్తోత్రముచేసెను. కాంక్ష, కోరిక, కోర్కి, ఇచ్ఛ-౪ అపేక్ష. రోసెన్, పరికించెన్, నెమకెన్, తడవెన్, వెదకెన్. అరసెను,

అరసెను, వెతకెను - ౯ అన్వేషించెను. తన్నెను, తాఁచెను, అడుగు తాటించెను, కాళ్ళచేత + అడఁచెను-౪ కాళ్ళతోఁ దన్నెను,

సీ. కోమరు చొక్కాటమ్ము ♦ గోనబుచొక్కారము
చొక్కము మేలిమి ♦ జోఁక పోలుపు
నాణెంబు సౌరు వి ♦ న్నాణంబు తిన్నన
పరఁగు చొక్కా చెల్వు ♦ మురువు తనరు
నగు తియ్య పొనరు చె ♦ న్నలరు నలువు తీరు
వఱలు జాను చెలంగు ♦ కోఱలు నొనరు
చను తగు నొప్పు నె ♦ సంగు ననెడుపేళ్ళ
తగు మంజులమునకు ♦ దండ యొద్ద

తే. చెంత కుఱఁగలి డగ్గఱ ♦ చేర్వ పొంత
దాపు సరస కెలను పజ్జ ♦ ప్రాపు వద్ద
యండ చక్కి గరిడియన ♦ నమర నో స
మీపనామములు మనోజ్ఞ ♦ రూప సాంబ. 39

టీ. కోమరు, చొక్కాటమ్ము. రూ. చొకాటము, చొక్కటము, గోనబు, చొక్కారము. రూ. చొక్కారము, చొక్కము, మేలిమి, జోఁగ, పోలుపు, నాణెము. రూ. నాఁడెము, సౌరు. విన్నాణము, తిన్నన, పరఁగు, చొక్కా రూ. చొక్క, చొకా, చెల్వు. రూ. చెలువు, మురువు, తనరు, నగు, తియ్య, పొనరు, చెన్ను, అలరు, నలువు, తీరువఱలు, జాను, చెలఁగు, కోఱలు, ఒనరు, చను, తగు, ఒప్పు, ఎసఁగు - ౪౦ అందమైనది. దండ, ఒద్ద, చెంత, కుఱఁగలి, డగ్గఱ. రూ దగ్గఱ, చేర్వ, రూ. చేరువ, పొంత, దాపు, సరస, కెలను, పజ్జ, (సం. పశ్చాత్.), ప్రాపు, వద్ద, అండ, చక్కి గరిడి.౧౭ సమీపము.

సీ. పిమ్మటఁ దరువాతఁ ♦ బిదప వెన్క వెనుక
నన౹గఁ బశ్చాదభి ♦ ఖ్యలు చెలంగు
సడలె వదలెఁ బ్రీలె ♦ జాఱెవీడె ననంగఁ
జ్యుత సమాఖ్య లగు లొ ♦ చ్చు కొఱఁద కడమ
కుఱుచ యొచ్చెము తగ్గు ♦ కొంచెము తక్కువ
కుందు కొఱఁదవ లోను ♦ కొద్ది యనఁగ
మెఱయు న్యూనతపేళ్ళు ♦ మిక్కిలి యెక్కువ
యెచ్చు పెల్లుదనము ♦ పెచ్చు మిగుల
తే. హెచ్చనఁగ నధికాభిఖ్య ♦ లెసఁగుచుండుఁ
దొలుత ముందర మున్ మున్ను ♦ తొల్లి మునుపు
ముందు మును తొలియనఁ జనుఁ ♦ బూర్వమునకుఁ
దడవుజాగన నాలస్య ♦ మడరుసాంబ. 40

టీ. పిమ్మటన్, తరువాతన్, (తరువాయి శబ్దమునకు సప్తమ్యేకవచనము,) పిదపన్, వెన్క. వెనుక-౫ అనంతరము. సడలెన్, వదలెన్, ప్రీలెన్, జాఱెన్, వీడెన్—౫ శిథిలమయ్యెను. లొచ్చు, కొఱఁద, కడమ, కుఱుచ, ఒచ్చెము. తగ్గు, కొంచెము, తక్కువ, కుందు. కొఱఁదవ, లోను, కొద్ది-౧౨ స్వల్పము. న్యూనత్వము, మిక్కిలి, ఎక్కువ, ఎచ్చు, పెల్లుదనము, పెచ్చు, మిగుల. హెచ్చు-౭ అధికము, తొలుత, ముందర, మున్, మున్ను, తొల్లి, మునుపు, ముందు, మును, తొలి-౯ పూర్వము. తడవు, జాగు, -౨ ఆలస్యము.

సీ. తాఱుమాఱయ్యెను ♦ దడఁబడె వీడ్వడె
నన వివర్యాసాఖ్య ♦ లమరు సాము
పగము సాఁబా లన ♦ దగు నర్ధ మనుటకు
దూఁకొనెఁ జొరఁబాఱె ♦ దూఱెఁ జొచ్చె

సాము ప్ర. సామి అనితోఁచెడిని. సామి అనునదిసాంస్కృతికావ్యయము

ననఁగఁ బ్రవేశించె ♦ ననుటకుఁ దనరారు
మొత్తె గొట్టెను వ్రేసె ♦ మోఁదె ననఁగ
బ్రహరించె ననుట కౌఁ ♦ బనిచె ననిచెఁ బుచ్చె
నంపెఁ బుత్తెంచెఁ బొ ♦ మ్మనియెఁ బంపె

తే. గెలువుమనె ననఁబ్రస్థితా ♦ ఖ్యలు చెలంగుఁ
ఛాయ పొంతనఁ జోటనఁ ♦ బాయ యిక్క
చక్కి తావనఁగఁ బ్రదేశ ♦ సంజ్ఞ దనరు
నంబరనదీలసజ్జటా ♦ డంబ సాంబ. 47

టీ. తాఁకుమాఱయ్యెను, తడఁబడెన్, పీడ్వడెన్, - ౩ వ్యత్యస్తమాయెను. సాము - సగము, సాఁబాలు - ౩ అర్ధము. దూఁకొనెను, చొఱఁబాఱెను, దూఱెన్, జొచ్చెన్ ౪ ప్రవేసించెను. మొత్తెను, కొట్టెను, వ్రేసెన్, మోఁదెన్, ౪ ప్రహరించెను. పనిచెన్, అనిచెన్, పుచ్చెన్ (పోవుధా. ప్రేరణరూపము.), అంపెను, పుత్తెంచెను, పొమ్మనియెన్, పంపెన్; గెలువుమనెన్ - ౮ ప్రయాణముచేసి పంపెను. చాయ, పొంతు, చోటు, పాయ, ఇక్క, చక్కి, తావు - ౭ ప్రదేశము.

సీ. అచట నయ్యెడ నందు ♦ నచ్చో నదిగొ యట
నచ్చట నక్కడ ♦ నకడనాడ
నావంక నల్లదె ♦ యనఁ దత్ప్రదేశాఖ్య
లౌదవు ముంగల మ్రోల ♦ నెదుట ముందు
ముందట యనఁగ స ♦ మ్ముఖము పేళ్ళు రహించు
నిరుదెస లిరువంక ♦ లిరుగెలంకు
లిరుప్రక్క లిరుమూల ♦ లిరుగ్రేవ లిరుగడల్
నూరె లనెడిపేళ్ళు ♦ మీఱు నుభయ

